# ఆత్మహత్య

## జనపరిష్వయ్ం

[ హాస్యనాటికలు ]

డి. వి. నరసరాజు

ప్రఖ్యాత శ్రీరామమూర్తి

దేశికవితామండలి
విజయవాడ-2

దేశీ ప్రచురణ
ప్రథమ ముద్రణ
జనవరి '52
కళ్యాణీ ప్రెస్.
భారత ముద్రణాలయం
విజయవాడ —
రూపాయి పావలా



సంపాదకులు

బొందలపాటి శకుంతలాదేవి
శివరామకృష్ణ

## ఆత్మహత్య —

### పాత్రలు

ఏడుకొండలు
పున్నయ్య
తిరువెంగడం
గోపాలరావు
వాణీప్రసాద్
కామాక్షి



1951 తెనాలి నాటక కళాపరిషత్తు
సమావేశంలో ప్రదర్శించినప్పుడు—

## పాత్రధారులు



ఏడుకొండలు : శ్రీ మాచినేని వెంకటేశ్వరరావు.
పున్నయ్య : శ్రీ K. వెంకటేశ్వరరావు.
తిరువెంగడం : శ్రీ V. రామన్నపంతులు.
గోపాలరావు : శ్రీ K. V. S. శర్మ.
వాణీప్రసాద్ : శ్రీ శ్రీరామమూర్తి.
కామాక్షి : శ్రీమతి R. నిర్మల.

# ఆత్మహత్య



[తెనాలి పట్టణం నాటకకళకు పుట్టినిల్లు ఆంధ్రదేశంలో ప్రఖ్యాతి చెందిన నటులు చాలామంది తెనాలివారే. గొప్ప గొప్ప నాటక సమాజాలు యీవూళ్లోనే వెలిసినై. ప్రథమంగా నాటకకళా పరిషత్తు సురభి గోవిందరావు ప్రభృతులచే స్థాపించబడింది యీ వూళ్లోనే.

అటువంటి తెనాలిలో ఒక చిన్నహోటల్లో ఒక చిన్నగది. యీవూరికి వచ్చే సామ్యే నటీనటులకీ, నాటక సమాజాలకీ యీ గదే ప్రత్యేకంగా అద్దెకిస్తుంటాడు హోటలు ప్రొప్రయిటరు వున్నయ్య.

తెరలేచేసరికి గదిలో ఏడుకొండలు ఒక్కడే వుంటాడు. ఒక చిన్నకత్తి పిడికిట్లో పట్టుకుని, దానివంక, కళ్లు పెద్దవిచేసి, అదేపనిగా చూస్తూ, వుద్రేకంతో వూగిపోతూ- ఒక్కసారి అమాంతం గుండెల్లో పొడుచుకొని, "హా" అని నేలమీదకు ఒరిగిపోయి, గిల గిలా తన్నుకుంటూంటాడు.]

(తలుపు చప్పుడు)

ఏ : (పండుకుని వుండే) ఎవరది ?

పు : (బయటనుంచి) నేనే; పున్నయ్యనండి!

ఏ : రండి లోపలికి.

(పున్నయ్య ప్రవేశం యాభై పై బడ్డ వయస్సు. మనిషి నిండుగామత్తుగా వుంటాడు )

పు : క్రిందపడుకున్నావేం, ఏడుకొండలు! మంచంవుండగా!

ఏ : (మెల్లగా లేవబోతూంటాడు)

పు : పడుకో, పడుకో లేవకు! నేవెడతాను.

ఏ : ఎబ్బే! పడుకోలేదు పున్నయ్యా:— (లేచి మన్ను దులుపుకుంటూ) ఆత్మహత్యసీను రిహార్సలు చేసుకుంటూన్నాను. దీనిదుంపతెగా- యీ ఆత్మహత్య వుందే- యింత ప్రాణంతీసేది మరోటి లేదయ్యా! నాటకంలో మరొకడితో యుద్ధంచేసి చావమనండి. వురిపోసుకొని చావమనండి, లేక విషంతాగి చావమనండి.-అద్భుతంగా చేస్తాను. కాని ఒక కత్తితో మనకి మనం పొడుచుకు చావడమంటే- ప్రాణం మీదికొస్తుంది.— యీసీనుమట్టుకు యీసీను లక్షసార్లు రిహార్సలు చేశా! ఏం ప్రయోజనం. నాటకంనాడుమట్టుకు పొడుచుకోకముందే క్రిందపడి పోతా!

పు : కష్టమేలే—చూస్తూ చూస్తూ అకారణంగా పొడుచు

కొని చావాలంటే....

ఏ : నాకేగాదయ్యోయ్! యీ అవస్థ పెద్ద పెద్ద యాక్టర్లకే వుంది. మన బళ్ళారి రాఘవాచార్యులుగారు గూడ- "నాకు స్టేజీమీద ఆత్మహత్య అంటే చెడ్డ చిరాకు" అని అనేకసార్లు అంటూండే వారని నా మిత్రు డొకడు నాతో అన్నట్లు జ్ఞాపకం.

పు : అవునవును. ఒక్కొక్కళ్ళకి ఒకోటి యిష్టం. చచ్చి ఏ లోకాన వుందో - శ్రీరంజని- నాతో అంటుండేది. ఆవిడకి స్టేజీమీద అదే పనిగా ఏడ్చి ఏడ్చి చావడం సరదా! రామతిలకానికి చచ్చి మళ్ళీ బ్రతకడమంటే సరదా! రామనాధ శాస్త్రికి ..

ఏ : (ఆసక్తితో) రామనాధశాస్త్రిగారు నీకు తెలుసా?

పు : అయ్యో! నాకు చాల ఆప్త మిత్రుడయితే!

ఏ : గొప్ప నటుడు! (అని నమస్కరిస్తాడు.)

పు : ఒక రామనాధ శాస్త్రేమిటి? యడవల్లి సూర్య నారాయణ, బళ్ళారి రాఘవాచార్లు, తుంగల చలపతి, బొన్నవిత్తుల శేషగిరి .... అసలు ఆంధ్రదేశంలో నటుడన్నవాడు యీ వూరు వస్తే మన హోటల్లో నేగదయ్యా బస.

ఏ : నీవు నిజంగా పూర్వ జన్మలో ఎంత పుణ్యం చేసు కున్నావో, పున్నయ్యా !

పు : వాళ్లందరి ఫొటోలు మొన్నటిదాకా యీగోడలకి తగి లించి వుండేవి. మొన్న సున్నంగొట్టించేపుడు తీశాను. మళ్ళీ తగిలించాలి....ఎంత మంది మహానటులకు ఆశ్రయమిచ్చిందనుకున్నావు. యీ గది.

ఏ : అటువంటి యీ గదిలోనే నేనుగూడా వుండేభాగ్యం గలగటం నిజంగా నా పూర్వ జన్మ సుకృతం పున్నయ్యా ! (తన్మయంతో Sudden గా) ఆ ! చెప్పటం మరచాను ! రాత్రి నాటకమయ్యాక వచ్చి పండుకున్నానా ! కలలో ఒక మహానటుడు కనిపిం చాడయ్యా !—ఆయన ఎవరో సరిగా గుర్తుబట్ట లేదుగాని - మొత్తంమీద ఎవరో మహానటుడే ! సందేహంలేదు.—కనిపించి చెప్పాడుగదా ! "ఒరే! ఏడుకొండలూ ! మేంపోయినా నీలాంటి వాళ్లంద బట్టే యీ పౌరాణిక నాటకాలు యింతవరకూ బతి కున్నాయ్ ! యీ కొత్త సాంఘికనాటకాల దాడి నుంచి మన పురాతన నాటకాలను రక్షించే భారం నీది. నీకు అండగా మేమంతా వుంటాం. సాగించు పోరాటం" అని వీపు చరిచి హెచ్చరించాడు

పున్నయ్యా!

పు: అంతేబాబూ! అంతే! యీ గదిలో మరాం చేసే ప్రతి నటుడితోనూ వాళ్లు అలానే యెరబెట్టుకుంటూం టారు, ఉంజేస్తారు మరి! వాళ్ల ఆత్మలకి శాంతి లేక!....

ఏ: అందుకే గాబోలు పున్నయ్యా! పొద్దుటినుంచి నా కేదో కొత్త శక్తి వచ్చినట్టు అనుమానంగా వుంది. యీ రాత్రికి చూసుకో ఎట్లా యాక్టు చేస్తానో.

పు: అన్నట్టు యివాళ ఏమిటి నాటకం?

ఏ: 'జాంబవతీ పరిణయం' మోయ్! — యిదుగో కర పత్రం చూశావా! (అని తీసి చదువుతాడు)

యీ నాటకంలో శ్రీకృష్ణ జాంబవంతుల భీకర యుద్ధం చూచి స్వయంగా ఏడ్వవలసినదే గాని. యిక్కడ వ్రాయనలవిగాదు. జాంబవతీ పాత్ర ధారిణి అభినవ Monkey brand....

పు: అంటే కోతిమూతి పెడతారా?

ఏ: ఓ! దాన్ని గురించి పెద్ద పెద్ద పండితుల్ని Consult చేశాం. జాంబవతి తల్లిపోలికా, తండ్రి పోలికా అని మీమాంస వచ్చింది. చివరికి తండ్రి

పోలికే నని పండితులంతా ఏకగ్రీవంగా అంగీకరించారు.

పు: నాటకం పాతదేనా, ఏమైనా మార్పులు....

ఏ: పాత నాటకాన్నే - కొత్తవాళ్ళచేత వ్రాయించి, సరి కొత్తగా తయారు చేయించాను.

పు: అహఁ - నే నడిగేది - వీరరస ప్రధానమా, భక్తిరస ప్రధానమా?

ఏ: ఆ రస మేమిటి యీ రస మేమిటి - అన్ని రసాల మిక్శ్చర్. మొన్న బందర్లో నాటక మాడితే— నా wife feelings చూసి, ఆడియన్సంతా అదే పనిగా వల వల వల మని ఒకటే యేడుపు! యిక అదేపనిగా ఏడిపిస్తే బాగుండదని-నేనే నా wife ని feelings కొంచెం Cut చెయ్యమన్నాను.

పు: అవునవును.too - much అయినా అంత బాగుండదు.—రాత్రి నాటకానికి డబ్బేమాత్రం వచ్చింది?

ఏ: ఏముంది? House full, cash nil. అన్నీ కాంప్లిమెంటరీలే! పోలీసు డిపార్టుమెంటువారు, వినోదం Tax డిపార్టుమెంటువారు, మునిసిపాలిటీవారు సకుటుంబ సపరివార సమేతంగా వచ్చేసి రిజర్వు

క్లాసు మొత్తం ఆక్రమించారు. హాలువారు అద్దెగాక హండ్రెడ్ 1st class Complimentaries పుచ్చు కున్నారు. యి కవతల క్లాసుల్లో సందులేకుండా ఉన్నయ్‌గాని కుర్చీలు, 10 కుర్చీలకి ఒకమనిషి వుంటే వొట్టు! —యింకేం ఏడుస్తాం పున్నయ్యా, చెప్పుకుంటే సిగ్గుచేటు.

పు: అంతే గాదులే బాబూ! యిసుగో యీ కొత్తరకం పద్యాల్లేని నాటకాలొచ్చినై—సాంఘిక నాటకాలంట— వీటమ్మటబడ్డారు జనం! మరీ యీ పట్నవాసాల్లో బహు జోరుగావుంది వీళ్లపని! ఏవో పరిషత్తు లంట! శాఖలంట!

ఏ: నిజం చెప్పావు పున్నయ్యా! యీ బస్తీలలో నాట కాలు ఆడినంత బుద్ధితక్కువ యింకోటి లేదు. మన పురాణ నాటకాలకి పల్లెటూళ్లే రైటనుకో!

పు: కదూమరి! పల్లెజనం అంటే సత్యకాలపువాళ్లు!

ఏ: కాని యింకో చిక్కుంది పున్నయ్యా! నాటకం గనక బాగోపోతే బస్తీలో అయితే ఒట్టి తిట్లతోనే పోతుంది. కాని పల్లెటూళ్లల్లో వీపులు చెడతయ్ పున్నయ్యా! పారిపోదామన్నా వీలుండదు.

పున్న : (నవ్వి-బల్లమీదవున్న పూలగుత్తి ఒకటి చూస్తాడు)
ఎక్కడ కొన్నావు బాబూ! యిది చాలా బాగుంది?

ఏ : అదా? చెప్పటం మరచిపోయాను. రాత్రి ఒక గమ్మత్తు జరిగింది. నాటకం అయిన తరువాత ఒక పెద్ద మనిషి ఎవరో green room దగ్గరికొచ్చి, గేటులో కుర్రాడి కిదిచ్చి "ఇది కామాక్షికి నా కానుకగా ఇవ్వు" అన్నాట్ట. మీ పేరేమిటి అని అడిగితే — "నా పేరెందుకులే - పేరెందుకులే" అని చకచకా వెళ్లిపోయాట్ట. నిజంగా నేను ఎంత ఆనందించా ననుకున్నావ్? — వెధవడబ్బు - డబ్బుదేముంది? నా భార్య నటనా కౌశలాన్ని మెచ్చుకోగలిగిన రసజ్ఞుడు ఒక్కడైనా యీ వూళ్లో వున్నాడు - అంతే చాలనను కున్నాను. (పూలగుత్తి చేతబట్టి)- ఖరీదు ఎంతయితే యేం, కానుక కానుకే!- అందుకే ఒక కవి యేమన్నాడో తెలుసా పున్నయ్యా!

రసాపిపాస హృదయమ్ము కలచివేయ,
కార్చినాడొక వేడి కన్నీటిబొట్టు!—

(Pause) కవిత్వం చెబడానికేం, బాగానేవుందిగాని; యిటువంటి కానుకల్తో కడుపులు నిండుతయ్యా! రేపు యిది తీసికెళ్లి స్టేషనుమాష్టరుకు చూపిస్తే,

టిక్కెట్టు లేకుండా రైలెక్కనిస్తాడు ?

పు : నువ్వేం దిగులుపడొద్దు ఏడుకొండలు. మాపుల్లో నాటకమేసిన వాడెవడూ నష్టంతో బయటికిపోడు. పెద్దవాణ్ణి నే జెబుతున్నాగా! చూడు! మనకష్టం ఫలిస్తుంది. యింత కష్టపడి 'జాంబవతీ పరిణయం' నాటకం ఆడితే ఆ శ్రీకృష్ణపరమాత్మ మమ్మల్ని ఆమాత్రం కనికరించడూ!

(ప్రవేశం- కామాక్షి. బజారునుంచి ఏవో వస్తువులు కొనితెస్తుంది)

కా : ఏంచేస్తున్నారు ?

ఏ : యింతసేపున్నావేం, బజారుకెళ్లి !

కా : బజార్లో మన నాటకం Advertisement ఎంత బ్రహ్మాండంగా పంపుతున్నారు ?- ఒకడికి జాంబవంతుడి వేషం, ఒకడికి జాంబవతి వేషం వేసి, రెండెడ్ల బండిమీద కూచోబెట్టారు. బండినిండా రంగు కాగితాలు- వెనక బ్యాండుమేళం. అబ్బ, ఎంత బాగుందని! చుట్టూ జనంమూగి కేకలుపెడుతూ, సంతోషం పట్టలేక బండిమీదకి రాళ్లు విసురుతున్నారు.

ఏ : రాత్రి నాటకంలో స్టేజీమీదకి విసరరుగదా!

కా : నన్ను చూస్తే నా వెంట ఎక్కడ పడతారో నని - సందు గొందులన్నీ తిరిగి తప్పించుకొచ్చా !

పు : అంతేనమ్మా !—యీ వూళ్లో ఎప్పుడూ అంతే !

ఏ : యివాళ నాటక మైపోయి, రేపు యీ వూరునుంచి బయట పడే దెట్లాగా అని. రైలు కర్చులకిగూడ డబ్బులు లేవు.

పు : యిక నే వస్తా (అని వెళ్ళబోతాడు)

ఏ : యిదుగో వున్నయ్యా ! రేపల్లె ఎంత దూరం యిక్కడికి ?

పు : ఆఁ, ఎంత! రైల్లో గంట ప్రయాణం.

ఏ : రైలు గాదు—రోడ్డున ఎన్ని మైళ్లు?

పు : ఆఁ, 20 మైళ్లు. (అని వెళ్ళబోతాడు.)

ఏ : (కామాక్షితో) మీ ఆడవాళ్ళంతా పొద్దున్నే రైలుకి పదండి. మొగాళ్ళమంతా నడిచో ఎట్లాగో చేరుకుంటాం.

కా : నడిచా! యీ ఎండల్లో - మీ కాళ్ళకి చెప్పులన్నా లేవు.

ఏ : చెప్పు లెక్కణ్ణుంచొస్తయ్. నాలుగు రూపాయ లుంటే, నువ్వే బజారుకెళ్ళి ఏవేవో కొనుక్కొస్తివి.

కా : నా తలవెంట్రుకలకి రంగు అయిపోయిందండి. అందుకని రంగు పొట్లం ఒకటి కొనుక్కొచ్చానండి.

ఏ : అప్పన్లే. అదీ అవసరమేగా ! ఆ తెల్లవెంట్రుకలు బయటపడితే (పూలచుత్తి చేతబట్టి) యిటువంటి రసజ్ఞులంతా యిక మన మొఖం చూస్తారా ?

కా : ఆయన ఎవరై యుంటాడండి.

ఏ : ఎవడో పాపం, నీ acting చూసి, అమాంతం ice అయిపోయుంటాడు.

కా : మీకు అసూయగా వుంది గదూ ?

ఏ : ఛ, ఛ. అసూయేమిటి ; అమితానందంగా వుంటే. యిటువంటి వాళ్లు వూరికి ఒకడైనా వుండబట్టే, మన నాటకాలు యింతవరకైనా బ్రతికున్నాయ్.

కా : ఆఁ చెప్పటం మరిచానండోయ్. యివాళ నాటకంలో జాంబవతి వేషానికి ఆ 'కోతిమూతి' తగిలించుకోనండి.

ఏ : ఏమిటి ? కోతిమూతి తగిలించుకోవూ ? కోతిమూతి లేకపోతే యిక జాంబవతికి సత్యభామకి భేద మేముంది ?

కా : శ్రీ కృష్ణుడి భార్యకి కోతిమూతి ఏమిటండి ?

ఏ : శ్రీ కృష్ణుడిభార్య అయేది Viceroy గారి భార్య అయేది - జాంబవతికి కోతిమూతి వుండాల్సిందే.

జాంబవతి పండ్రి గోలికేనని మన పండితులంతా ఏకగ్రీవంగా ఆమోదించారు.

రా : ఏమోనండి. నా మూతి చూసి ప్రేక్షకులంతా నవ్వుతున్నారు.

ప : ఎవరు నవ్వేది? ఆడప్రేక్షకులా? మొగప్రేక్షకులా?

రా : మొగప్రేక్షకులే!

ప : అసలు నువ్వు Act చేసేప్పుడు మొగప్రేక్షకులవంక ఎందుకు చూడ్డం? మనకి కావలసింది ఆడప్రేక్షకులు. వాళ్ళకే భక్తి యెక్కువ. వాళ్ళంతా నీ Action చూసి నువ్వు కేవలం ఆ శ్రీకృష్ణపరమాత్మ యిల్లాలివని, భక్తితో నోర్లుబెట్టి, గుడ్లు మిటకరించి, భజనలు చేస్తున్నారు. మొన్న బెజవాడ నాటకంలో ఒక చిన్న పిల్ల భక్తి పారవశ్యంలో మూర్ఛపోయింది కూడా!

రా : మూర్ఛపోయింది భక్తివల్లో, భయంవల్లో!

ప : గిట్టని వాళ్ళు 'భయమే' నంటారు! మనకెందుకు వాళ్ళతో.

రా : అం. ఆ డ్యాన్సుకూడ తీసెయ్యాలండీ!

ప : (కోపంతో) ఏం యివాళ నీకిలాపుట్టింది. అన్నీ తీసెయ్యమంటున్నావ్?

కా: ఆ డ్యాన్సుచూసి, జనం యీలలువేసి, కేకలేస్తున్నారు. ఎవళ్లో ప్రేక్షకులు నాకి రెండు రాళ్లుకూడ వేశారు.

ఏ: మరి అట్లా కోతిగంతులు వేస్తే రాళ్లెయ్యరూ?

కా: కోతి, కోతిగంతులెయ్యక, ఏగంతులేస్తుంది మరి.

ఏ: ఓసి పిచ్చిదానా! నీకసలు ఆ పాత్రే అర్థంకాలేదు. కోతి అంటే సామాన్యపుకోతికాదు. చదువూ, సంగీతమూ, నాట్యం నేర్చినకోతి. సాక్షాత్తు ఆ కృష్ణపరమాత్మను తనభర్తగా ఆకాంక్షించినకోతి—అది ఎంత కాపుకోరో ఆలోచించుకో.—నటి అంటే పాత్రని అలా తర్కించి, అర్థంచేసుకోవాలి.

కా: ఏమన్నాకానీండి! నే నీవాళ ఆడ్యాన్సు చేయను.

ఏ: నువ్వు చెయ్యకపోతే ప్రేక్షకు లూరుకుంటారా? డ్యాన్సో డ్యాన్సో అని గగ్గోలు పెడతారు.

కా: అయితే యింకేదన్నా డ్యాన్సు నేర్పండి. ఆ డ్యాన్సయితే నేను చేయనే చేయను.

ఏ: అయితే-యీ డ్యాన్సు చూడు—(అని డ్యాన్సు చేస్తాడు) "ఇల కలా ఆ కోకిలేమో, పలకరించే వింటివా?"—

కా: (లేచి అతనితోపాటు డ్యాన్సు చేస్తుంది.)

ఏ : అలా కాదు! యిలా వయ్యారంగా నడవాలి. (అని చేసి చూపిస్తాడు.)

కా : బాగా రావడం లేదండి.

ఏ : యివాళ నాటకం ఎలాగో నెట్టేసెయ్. రేపు రేపల్లె నాటకానికి బాగా తర్ఫీదు చేస్తాను.

కా : తరువాత గుడివాడ నాటకానికి అద్భుతంగా Dance చేస్తానండి.

ఏ : గుడివాడ? అక్కడ నువ్వు ఎంత అద్భుతంగా నైనా చెయ్యి, ఏమీ లాభంలేదు. ఆ జనానికి మన నాటకాలు గిట్టనే గిట్టవ్. మన నాటకాలకి గుడివాడంత దరిద్రపు Centre మరొకటి లేదనుకో.

కా : యిదివరకి డబ్బు బాగానే వచ్చేది గదండి గుడివాడలో.

ఏ : యిదివరకి సంగతి వేరు - యిప్పుడు సంగతివేరు. ఆ వూళ్లో ప్రస్తుతం పరిషత్తు తాలూకు నలుగురు ప్రబుద్ధులు చేరారు. ఏవో శాఖలట - సాంఘిక నాటకాలంట!—చూడు, రేపు మద్రాసు వెళ్ళినప్పుడు మన మంత్రిగారితో మాట్లాడి యీ కళాపరిషత్తును అమాంతం ban చేయించేస్తాను.

కా : ఆఁ మీరు చెయ్యమంటే చేస్తారేమిటి ? వాళ్లు వాళ్లు అంతా ఒకటే.

ఏ : ఓసి ! పిచ్చిదానా ! నువ్వుగూడ అందరిలాగే అనుకుంటున్నావ్ ! మనకి మంత్రిగారి దగ్గర ఎంత పలుకుబడి వుందో తెలుసా ?—ఆఁ. మొన్న వినోదపు పన్ను ప్రభుత్వం రద్దుచేసింది తెలుసా ?

కా : అవును.

ఏ : ఆ రద్దు చేయించిం దెవరు ?

కా : మంత్రిగారటగా !

ఏ : మంత్రిగారేలే ! ఆ మంత్రిగారికి చెప్పి చేయించిం దెవరు ?—నేను! "ఏమండి యీ వినోదపు పన్ను మీరు తప్పనిసరిగా రద్దు చేయాలి" అని గట్టిగా చెప్పాను. అంతే ! రద్దు చేసేశారు.

కా : నిజంగానండి ! ఏమోనబ్బా !....

ఏ : (విస్తుబోయి) ఏం నీకు నమ్మకంలేదా ?- చేసుకున్న పెళ్లానివి, తోటి నటివి నువ్వే నమ్మకపోతే, యిక లోకులేం నమ్ముతారు ?

కా : లోకుల సంగతి మనకెందుకులెద్దురూ !

ఏ : మనకెందుకేమిటి ? లోకులకోసం కాకపోతే ఎవరి

కోసం యీనాటకాలాడ్డం ? దేశం అథోగతి పాలౌపు తోంది. కూలిజనాభా పెరిగిపోతోంది. గుడ్డకీ కరు వొచ్చేసింది. లక్షలాది ప్రజలు అంటు వ్యాధు లకి ఆహుతి అయిపోతున్నారు. నాయకుల్లో కలహాలు బయలుదేరినై. బ్లాకుమార్కెట్టు పెచ్చుపెరిగి పోతోంది. దొంగదేశభక్తులు తయారవుతున్నారు. దీనికంతకూ కారణమేమిటి ? ప్రజలలో దైవభక్తి సన్నగిలింది. నాస్తికత్వం ప్రబలిపోయింది. దీనికి ఒకటే విరుగుడు. ప్రజలలో దైవచింత పెంపొం దించాలి. ఆధ్యాత్మికశక్తిని అభివృద్ధి చెయ్యాలి. అందుకోసం జాంబవతీ పరిణయంలాంటి పుణ్య నాటకాలను వూరూరా, వాడ వాడలా విరివిగా ప్రద ర్శించాలి. యిలాటి ప్రదర్శనాలకు ప్రభుత్వం తగిన ప్రోత్సాహం యివ్వాలి. పురాణ నాటకాలను ఖండించే వాళ్ళమీద 144 సెక్షను జారీచెయ్యాలి. దేశ క్షేమా నికి యింతకంటే వేరేమార్గంలేదు. యిందుకు నే నిప్పుడే కంకణం కట్టుకున్నాను. పురాణ నాటకాలను పునరుద్ధరిస్తాను. స్వర్గస్థులైన ఓ ఆంధ్ర మహా నట నటీమణులారా ! నన్నాశీర్వదించండి. మీరందరూ నాలో ప్రవేశించి, నాకు వుత్తేజాన్ని కలిగించండి.

(దండకం) ఓ కులదేవతల్లార! స్వర్గస్థులైనట్టి ఓ ఆంధ్ర నటులారా! రంగమార్తాండుడా రామనాధశాస్త్రి! నాటి యాచార్యుడా యడవల్లి సూరయ్యా! బళ్లారి రాఘవా: సురభి గోవిందయ్యా! నెల్లూరు నగరాజ! రామతిలకమ్మ! పలకండి! కదలండి. నీ శిష్యుడైనట్టి, నీ బంటునైనట్టి నా మొరాలించి, నా కోర్కె మన్నించి, దేశాన్ని కరుణించి, పురాణ నాటకాల్ పునరుద్ధరించండి. మీ అండగాపున్న, మీ వెంటనేవున్న భూత ప్రేత ములన్, పిశాచాది గణంబులన్ బంపి. మన శత్రులన్ పట్టి, ఛేదించి, సాధించి, పీడించి, చెండాడి, మమ్ముం బ్రోవరే, వేగ కాపాడరే, మమ్మురక్షింపరే- పాహిమాం. పాహి పాహిమాం.

[మధ్యలో కామాక్షిగూడ సూర్యుని ప్రార్థించుతుంది.]

[ఏడుకొండలు లేచి, పూనకం పూనినట్లు పూగిపోతాడు]

కా : శాంతించండి, శాంతించండి. అంత వుద్రేకం పనికి రాదు.

ఏ : యింకెన్నాళ్లు సహించమంటావ్ ?

[తలుపు చప్పుడు]

ఏ : (ఆదుర్దాగా) ఎవరని ? (అని కత్తి తీసుకుంటాడు)

పు : నేనే ! (అని లోనికి వచ్చి) మీ కోసం ఎవరో

యిద్దరు పెద్దమనుషులు - బెజవాడంట - వచ్చారు.

ఏ : రమ్మను. లోపలికి రమ్మను. (పున్నయ్య Exit) కామాక్షీ! నువ్వు లోనికెళ్లు కాసేపు (కామాక్షి లోనికి పోతుంది)

[ప్రవేశం గోపాలరావు, తిరువెంగడం. ఇద్దరూ సమాన వయస్కులే. 50 దాదాపు వయస్సు. గోపాలరావు కొంచెం టీవిగా వుంటాడు. తిరువెంగడం కొంచెం శ్రోత్రియంగా వుంటాడు.]

తి : అయ్యా! ఇది....తమరు....

ఏ : ఆఁ, ఆఁ. ఏడుకొండలు అంటే నేనే—రండి, రండి.

తి : పొరపాటు పడ్డట్టున్నాం—క్షమించండి. ఇక్కడ నాటకాలు వేసే....

ఏ : ఆఁ, మేమేలెండి....

తి : కామాక్షిగా రుండే గది....

ఏ : ఆఁ. యిదేలెండి. నేను కామాక్షి మొగుణ్ణేలెండి.

తి : ఓ. అలాగా! (అని సంతోషంతో గోపాలరావును ముందుకు రమ్మని సైగచేస్తాడు.)

ఏ : రండి, కూర్చోండి. ఏం పనిమీద వచ్చారు.

[తిరువెంగడం గోపాలరావు కూర్చుంటారు]

తి : అయ్యా! వీరిపేరు గోపాలరావుగారని - బెజ వాడలో పెద్ద లక్షాధికారి. గౌరవ బెంచి మేజిస్ట్రేటు. నా పేరు తిరువెంగడం. వీరికి కాబోయే వియ్యం కుడిని.

ఏ : అంటే...

తి : అంటే వారి అబ్బాయికి మా అమ్మాయిని యివ్వ బోతున్నాం.

ఏ : ఓహోహో! శుభం! అయితే ఆ పెళ్లి సందర్భంలో మా నాటకమైనా ప్రదర్శించాలని....

తి : ఎబ్బెబ్బే ..వీరి కుమారుడికి- అంటే నాకు కాబోయే అల్లుడన్నమాట- ఆయనకి నాటకాలంటే మహాపిచ్చి!

ఏ : నాటకాలు చూడడమేనా, లేక వేషాలు వెయ్యడం కూడానా ?

గో : అంతతో ఆగినా బాగానే వుండును.

తి : మొన్న మీరు బెజవాడలో నాటకం వేశారు....

ఏ : అవును. 'జాంబవతీ పరిణయం'—మీరు చూశారా ? (గోపాలరావుతో)

గో : నేనా ? (కోపంగా)

తి : వారు అసలు నాటకాలు చూడరులెండి. వారి అబ్బాయి

గారు చూశారట....

ఏ : ఎలా వున్నారు ?

తి : నాటకం ఎలావున్నా....

గో : అందులో నటీమణి అత్యద్భుతంగా వుందట.

ఏ : (సంతోషంతో) నిజంగానా ? ఆవిడేనండి కామాక్షి ఆవిడ మొగుణ్ణే నేను.

గో : (తిరువెంగడంతో) ఏమిటయ్యా యీ నానుడుబేరం, వచ్చిన పనేదో త్వరగా తేల్చుకోక.

తి : అయ్యా, మేమొచ్చినపని తమరితో విన్నవించుకుంటాను.

ఏ : చెప్పండి. నాకు చేతనయిన సహాయం తప్పక చేస్తాను.

తి : మొన్న మీ నాటకం చూచిన దగ్గరనుంచి వీరి అబ్బాయికి

ఏ : అంటే....

తి : నాకు కాబోయే అల్లుడుగారికి — కొంచెం మతి భ్రమించింది. ఎవరితోనూ పలకడు. ఎప్పుడూ ఏదో గొణుక్కుంటూ, తనలో తాను పిచ్చి పిచ్చిగా నవ్వుకుంటాడు.

ఏ : ఏమండి, మీరు పొరబడ్డారేమో! అది పిచ్చిగా దండి. కొత్తగా కలిగిన భక్తికిగూడ లక్షణాలు అలాగే వుంటాయ్.

గో : (వెక్కిరింపుగా) ఎవరిమీద భక్తి?

ఏ : ఆ శ్రీకృష్ణపరమాత్మమీద.

గో : కాదు మీ ఆవిడమీద.

ఏ : ఎవరు! కామాక్షిమీద, భక్తా?

గో : భక్తి గాదు—ప్రేమ!

ఏ ; ఏమండోయ్! మీరు కొంచెం జాగ్రత్తగా....

గో : (తిరువెంగడంతో) ఏమిటయ్యా నీళ్లు నములుతావు— అసలు సంగతిచెప్పక.

తి : (గుటకలు మింగుతూ) మీ నాటకం చూచిన దగ్గర నుంచీ వీరి అబ్బాయికి మీ భార్యమీద ప్రేమ కలిగింది.

ఏ : ఆఁ, ఏమిటి?

తి : కోప్పడకండి. అలా ప్రేమించడం తప్పనే మేమూ అనేది. ఏదో కుర్రవాడు మొండిపట్టుపట్టుకుని కూర్చున్నాడు. ఎలాగయినా మీరు కొంచెం సహాయం చెయ్యాలి.

ఏ : సహాయమా ! అంటే ?

తి : మీరలా కంగారు పడకండి. యిందులో మీ అభిప్రాయం మా అభిప్రాయం ఒకటే, ఒకళ్లని ఒకళ్లు అర్థం చేసుకోలేకపోతున్నాంగాని.

ఏ : అయితే మీ రనే దేమిటి ?

తి : మీరు శాంతించండి కొంచెం. ఏమీలేదు. — ఆ అబ్బాయికి మీ ఆవిడమీదనుంచి ఎలాగయినా మనసు మళ్లించివేస్తే- వెంటనే మా అమ్మాయిని యిచ్చి పెళ్లిచేసేద్దామని.

ఏ : హుం. (అని తలపంకించి ఏదో ఆలోచిస్తూంటాడు)

తి : ఎంతసేపూ మీ ఆవిడగొడవేగాని, మా అమ్మాయి పేరెత్తితే మండిపడుతున్నాడు. ఎంతజెప్పినా వినిపించుకోండే ?- యిప్పుడక్కడనుంచే వస్తున్నాం.

ఏ : యిప్పు డాయన ఎక్కడున్నాడు ?

తి : యిప్పుడేమిటి ? మీ నాటకం అయిన దగ్గరనుంచి మీ వెంటే తిరుగుతున్నాడు. మాకు అంతుదొరక్క, వెతుక్కుంటూవచ్చి యీవూళ్లో పట్టుకున్నాం. యీ వీధి చివరి హోటల్లో గదిలో వున్నాడు.

ఏ : అయితే ఒక పనిచేస్తారూ ?

తి : ఏమిటి ?

ఏ : మీరు వెంటనే బెజవాడ వెళ్లి సాయంత్రం బండిలో మీ అమ్మాయిని యిక్కడికి తీసుకురండి.

తి : ఎందుకు ?

ఏ : రాత్రికి నాటకం వుందిగా ! ఆ నాటకంలో ఆమెచేత జాంబవతి వేషం వేయిద్దాం.

గో : ఆఁ. (కోపంగా) ఏమన్నావ్ (అని లేస్తాడు)

తి : మీ రుండండి బాపగారూ (అని గోపాలరావును కూర్చోబెడతాడు) (ఏడుకొంండలుతో)— అలా నాటకాల్లో వేషాలు వెయ్యడం మాబోటి మర్యాదస్థులకి లాకీగాదు నాయనా.

ఏ : వ్రతం పెద్దా ఫలం దక్కుతుంది. ఒక్కరోజు భాగోతం. కాస్త కళ్లు మూసుకుంటే—మీ అమ్మాయికి పెళ్లి అవుతుంది- మీ అల్లుడికి పిచ్చికుదురుతుంది.

గో : ఎందుకయ్యా అనవసరపు ప్రసంగాలు. అసలు సంగతి సూటిగా చెబుతున్నాను విను. మావాడు కానేపట్లో మీ ఆవిడదగ్గరకు రావడానికి సిద్ధంగా వున్నాడు. వద్దని మేమెన్ని చెప్పినా వినేట్టులేదు. కాబట్టి, వాడు

రాగానే, మీ ఆవిడ వాడికి అసహ్యం కలిగే టట్లు ప్రవర్తించి మళ్ళీ యీ గడప తొక్కకుండా చేయాలి. ఇదీ నువ్వు చేయవలసిన పని. కావా లంటే - పది రూపాయలు తీసుకో. (అని పది రూపాయల నోటు తీసి మీద వేసి) అంతే!

ఏ : (కోపాన్ని దిగమింగి, పది రూపాయల నోటు మెల్లగా తీసుకుంటూ) అంత మదపిచ్చి యెక్కు వున్న మనిషి మాటలతో అంత తేలిగ్గా పోతా డంటారా?

గో : నువ్వేం మొగపుటక పుట్టలేదటయ్యా! పరాయి మొగాడెవడో నీ పెళ్లాం వెంటబడుతుంటే.... నీళ్లు నములుతావే....

ఏ : నీళ్లు నమలటం గాదండీ - మాటలతో పొమ్మంటే పోతాడా అని.

గో : పోకపోతే, తెచ్చి యింట్లో బెట్టుకుంటావా?

ఏ : ఎబ్బే!

గో : మరి ఏంజేస్తావ్?

ఏ : చంతాను. (తీవ్రంగా)

గో :
తి : } ఆఁ.

ఏ : నడుము విరగదన్ని బయటికి గెంటుతాను.

తి : ఎందుకండీ. తన్నుల్దాకా ఎందుకండీ. అతను చాలా మెత్తని మనిషి. ఒక్కమాటంటే వెనక్కి వెళ్ళి పోతాడు.

ఏ : మళ్ళీ యెక్కడా యిటువంటి పనులు జెయ్యకుండా ఏ కాలో చెయ్యో విరగ్గొట్టి మరీ పంపిస్తా !—పోండి, యిక పోండి. మీ రొచ్చిన పని అయిం దిగా ?

తి : (జంకుతో) నే చెప్పేది

ఏ : నువ్వు చెప్పినట్టే చేస్తాను. మళ్ళీ యీ గడప తొక్క కుండా చేస్తాను. కాని మాకేం లంచం అక్కర్లా. యిదుగో నీ డబ్బు ! ఎంత గడ్డిదిని గడించావో పాపం ! (అని నోటు గోపాలరావు మొఖాన గొడతాడు.)

గో : (కోపంతో) ఏంరా ! నీ పొగరు.

ఏ : నో రెత్తావంటే పళ్ళు రాల్తయ్ (అని మీదికి పోతాడు)

గో : ఏఁ. కొడతావా ?

ఏ : ఏఁ ఏంజేస్తావ్ (అని లెంపకాయ కొడతాడు.)

తి : (హడావుడిగా) ఆఁ. తప్పు, తప్పు. పెద్దలు పెద్దలు

ఏ : పొండి బయటికి. (కామాక్షి హడావుడిగా లోప ల్నుంచి ఏమిటండీ ఏమిటండీ అంటూ వస్తుంది.) ఊఁ. (గోపాలరావు, తిరువెంగడం బయటికి పారి పోతారు)

(Pause)

కా : ఏమిటండీ ; ఏం జరిగింది ?

ఏ : వెధవలు, పెద్ద మనుషులంబ పైగా !

కా : ఏమన్నారు ?

ఏ : నాటకాలవాళ్ళంటే అందరికీ చులకనే !

కా : అసలు సంగతేమిటండీ ?

ఏ : ఆతగాడి కొడుగు బెజవాడలో మన నాటకం చూశా డట. అప్పటినుంచి వాడికి నీ మీద ప్రేమ కలి గిందట - ప్రేమ ! వెధవకి.

కా : అయితే వా ళ్ళనేదేమిటి ?

ఏ : వాడికట ప్రేమతో పిచ్చెక్కిందట. కానేపట్లో యిక్కడికివస్తాట్ట్రి. అప్పుడు మనం మెత్తగా చివాట్లు పెట్టి వాణ్ణి ఎలాగైనా యింటికి పంపించెయ్యాలట.

కా : అందుకు మీ రేమన్నారు ?

ఏ : ఏమన్నానా ? నా వాకిట్లో కొస్తే కాళ్లు విరగ్గొట్టి

మరీ బయటికి గెంటుతానన్నా !

కా : (బయటికి చూస్తూ) రానియ్యండి. వెధవకి బాగా బుద్ధి జెప్పి పంపుదాం.

ఏ : బుద్ధి జెప్పిగాదు. కాలో చెయ్యో విరగ్గొట్టి మరీ పంపుతా !

(బయటనుంచి పున్నయ్యగొంతు "ఏమండీ" అని)

ఏ : ఎవరది ?

పు : (బయట్నుంచే) మీ కోసం ఎవరో వచ్చారు.

ఏ : అడుగో. వాడే అయ్యుంటాడు. నువ్వు తలాగిలా చెరుపుకుని, తాగిందానిలాగా మాట్లాడు. నే నీ తలుపు చాటున వుంటా (అని ప్రక్కనే దాక్కుం టాడు)

కా : రమ్మనండి పున్నయ్యగారూ ! (తల చెరుపుకుని కూర్చుంటుంది.)

(ప్రవేశం ఒక వ్యక్తి)

వ్యక్తి: నమస్కారమండి. తమరు....

కా : (ఎక్కిళ్లు వస్తుయ్) ఆఁ. నేనే. (అని క్రీగంట చూస్తుంది.)

వ్య : (ఆమె వైఖరి చూచి కొంచెం ఆశ్చర్యం) క్షమిం

చండి. తమరు....

కా : నేనేనంటే (తాగినట్టు మత్తుగా మాట్లాడుతుంది.)

వ్య : మీ పేరు కా....మా....క్షి....

కా : అవును. నాపేరు - కామాక్షి - అభినవ Monkey —brand. (అని వికటంగానవ్వి లేచి, నిలబడు తుంది)

వ్య : ఆఁ. రాత్రి మీ నాటకం చూచాను. ఆశే డబ్బు రాక పోయినా....

కా : ఆఁ. డబ్బు దేముంది. వెధవడబ్బు. మీలాటివారు మెచ్చుకోవాలిగాని....(వికారంగా నవ్వుతూ దగ్గర కొస్తుంది) ఒంటరిగా వున్నానని, చూచి వచ్చినట్టు న్నారే.

వ్య : (వెనక్కి జంకుతూ ఏదో అనబోతాడు)

కా : నీకు నాలాంటి అక్కలూ, చెల్లెళ్లూ లేరు? పరాయి ఆడవాళ్లంటే పారేసి వున్నారనుకున్నావా ?

వ్య : మీరు పొరబడుతున్నారు - నేను....

కా : పొరబాటేమీలేదు - నీ మొఖమే చెబుతోంది.

వ్య : ఛీ, మీరు తాగి, ఒళ్లు తెలీకుండా మాట్లాడుతున్నారు.

కా : నేను తాగితే ఎంతో, నువ్వు తాగకపోయినా అంతే!

వ్య : ఏయ్, నిన్నుచూచి ఏమిటో అనుకున్నాను. ఇంత నీచురాలి వనుకోలేదు. స్త్రీలోకాని కంతకూ, ముఖ్యంగా నటలోకానికి తీరని కళంకం తెస్తున్నావు. నీలాటివాళ్లుండబట్టే....

ఏ : (తలుపుచాటునుంచివచ్చి, చొక్కాచేతులు పైకితీస్తూ) ఏమిట్రా నీతులు చెబుతున్నావ్ ? (అనిమీదకి వస్తాడు)

వ్య : నీకు సిగ్గులేదూ ?

ఏ : నాకా ? నాకట్రా సిగ్గు ! (అని మొఖాన ఒకదెబ్బ కొడతాడు. వ్యక్తి ప్రక్క బల్లమీద పడతాడు. ఏడు కొండలు అతన్ని మళ్లీ లేపి, అతని చొక్కా పట్టు కుని, గట్టిగా మొఖాన కొడతాడు. ఆదెబ్బతో వ్యక్తి వాకిలి అవతల పడతాడు)

ఏ : వెధవ ! మళ్లీ జన్మలో యిలాటిపని చెయ్యడు.

కా : (జాలిగా) అసలే, చాలా మెతకసన్యాసిలాగున్నా డండీ !

ఏ : మెతక - యీదెబ్బతో జావయిపోయాడు.— (కామాక్షితో) వాడిప్పుడు తిన్నగా ఎక్కడికెళతాడో చెప్పు !

కా : ఏమో నాకేం తెలుసు ?

ఏ : పళ్ల ఆసుపత్రికి పోతాడు.—దెబ్బతో పళ్లన్నీ కదిలి పోతే - వెధకి !
[ప్రదేశం పున్నయ్య]

పు : నేను చెప్పలా ! మీ కష్టం వృధాగాపోదని. మా వూళ్లో నాటకమేసి నష్టంతో బయటికి పోవడమే !

ఏ : ఏమిటి గోల ?

పు : ఆ కృష్ణపరమాత్మే మిమ్మల్ని కనికరించాడు. ఏ మాత్రం యిచ్చాడేమిటి ?

ఏ : వా డిచ్చేదేమిటి - నేనే యిచ్చాను వాడికి - దవడ పళ్లు రాలేట్టు !

కా : యీ దెబ్బలో మళ్ళీ మా గడప తొక్కడు.

పు : ఏమయ్యోయ్, నీబోటి వాళ్ళని చాలా మందిని చూశాను. నా దగ్గరే నాటక మాడుతున్నావ్ ?

ఏ : నాటక మేమిటయ్యా—యింకొంచెం ముందొస్తే సర్కస్సే చూపించేవాణ్ణి !

పు : నాకు నాలుగోవంతు మామూలే ! నాది నా కిచ్చెయ్యండి.

ఏ : నాలుగో వంతేమిటి ?

పు : నిన్నేం కొత్తగా అడగటల్లేదు లేవయ్యా. మిగతా నాటకాలవాళ్ళని గూడ విచారించు కావాలంటే.

(ఏడుకొండలు, కామాక్షి కొంత అనుమానిస్తారు పున్నయ్య ధోరణిచూచి)

ఏ : ఏమిటి పున్నయ్యా ! నువ్వనేది ? 4వ వంతు భాగ మేమిటి ?

పు : యిప్పుడు వచ్చిన వాణీ ప్రసాద్‌గారు మీకు యిచ్చిన విరాళంలో నాకు 4వ వంతు మామూలు.

ఏ : వాణీ ప్రసాద్ ఎవరు ?

పు : యిప్పుడు వచ్చినాయనే ! మీరు అడిగినా ఆయన చెప్పడులే పేరు. చేసే సహాయ మేమిటో రహస్యంగా చేసిపోతాడు.

(యిద్దరూ విస్తుపోతారు)

ఏ : ఎవరు ఆయన ?

పు : ఆయన యీవూళ్లో లక్షాధికారి, యుపకుడు. నాటకాలంటే మహాసరదా. యీవూళ్లో ఏనాటకానికయినా నష్టం వచ్చిందంటే - వాళ్ల కష్ట సుఖాలు విచారించి, రెండోకంటివాడికి తెలీకుండా, వందో యాభై య్యో చేతిలోపెట్టి పోతుంటారు. ఇది మామూలుగా జరిగేదే.

ఏ : ఆఁ, నిజంగానా ?

పు : నిజంగానా ? మీ కెంతయిచ్చాడు.

ఏ : ఎంతపని జరిగింది కామాక్షి ! మన నోట్లో మనమే దుమ్ము కొట్టుకున్నాం కామాక్షీ (అని యేడుపు మొహం పెడతాడు.)

కా : అయ్యో ! (అని యేడుస్తుంది)

పు : (నమ్మతాడు) ఏం జరిగింది. ఆయన డబ్బివ్వలా ?

ఏ : ఆయన డబ్బిచ్చిందాకా ఎక్కడుంది పున్నయ్యా ! వచ్చి రావడంతోనే తిట్లుకి తగులుకొని - ఉపద పళ్లు రాలగొట్టి పంపించాను పున్నయ్యా !

పు : కొట్టడం దేనికి ?

ఏ : (కూలబడి) నే జెప్పలేను - నువ్వన్నా చెప్పవే కామాక్షీ !

పు : ఏమిటమ్మా ! ఏం జరిగింది ?

కా : బెజవాడనుంచి ఎవడో వెధవ నన్ను ప్రేమించి పిచ్చెక్కి చస్తున్నాడంట. వా డొస్తాడని తెలిసింది యింతకు ముందుగానే. యింకేముంది - యీాయన రాగానే - వాడే అనుకుని - అమాంతం పైనబడి కొట్టి బైటికి గెంటారు పున్నయ్యగారూ ! (ఏడు

కొండల్ని కావిలించుకుని యిద్దరూ ఏడుస్తారు)

పు : అయ్యో! ఎంతపని జరిగింది.

ఏ : ఆత్మహత్యకన్నా అన్యాయమయిపోయింది కామాక్షీ! (అని ఠకీమని ఆపి) ఆ,వుండు. అయిపోయిందానికి ఏడిస్తే ఏం ప్రయోజనంగాని — వుండు— యీ Feelings తో ఆత్మహత్య రిహార్సలు వేస్తే అద్భుతంగా వుంటుంది. (అని కామాక్షిని అవతలకు నెట్టి, బల్లమీద కత్తి తీసి, ఆత్మహత్య రిహార్సలుకు ఉపక్రమిస్తాడు) (కామాక్షితో) నువ్వు దూరంగా వుండు. నే పడిపోయింతర్వాత రా. (కామాక్షి దూరంగా వెడుతుంది) (పున్నయ్య చూస్తూ నుంచుంటాడు)

(ఏడుకొండలు కత్తి గుండెకు చూపుకుంటూ, కళ్లు మిటకరించి, భయంతో వూగిపోతూ - గుండెల్లో పొడుచుకుంటాడు. పొడుచుకోకముందే పడిపోతాడు)

కా : హా! ప్రాణనాధా (అని రాబోతుంది)

ఏ : అహఁ. ఆగు. ఆగు. పొడుచుకోకముందే పడిపోయాను. (అని లేచి మళ్ళీ మొదలుబెట్టి పొడుచుకుని క్రిందపడిపోతాడు)

ఆ త్మ హ త్య

కా : రైటేనా?

ఏ : రైట్, రైట్.

కా : హా! ప్రాణనాథా! (అని అతనిమీద పడిపోతుంది)

పు : (ముందుకి వంగి, అదేపనిగా చూచి) నే వెళ్లివస్తా ఏడుకొండలూ!

ఏ : కా:—మంచిది. వెళ్లిరా, పున్నయ్యా!

(పున్నయ్య వెడుతుండగా తెరపడుతుంది)



శ్రీ నవ్యకళా మండలి, విజయవాడ, వారిచే
14-9-51 తేదీన ప్రదర్శించి నప్పుడు పాల్గొన్నవారు :

చిదానందం : శ్రీ K. వెంకటేశ్వరరావు

శివపాదం : శ్రీ M. V. చలపతిరావు

పార్వతి : శ్రీమతి సుశీల;

పాత్రలు



చిదానందం : మాజిస్ట్రేటు వయసు 44 సం॥

శివపాదం : గుమస్తా - వయసు 38 సం॥

పార్వతి : చిదానందం రెండవభార్య - వయసు 25 సం॥

స్థలం : చిదానందంగారి మేడలో రెండవ అంతస్థుమీదగది.
సమయం : జనవరి 30 వ తారీఖు - మధ్యాహ్నం 3 గంటలు.



గార్డన్ డేవియట్ ఆంగ్లరచన దీనికి ఆధారం

# జనవరి ముప్పై

సమయం: 1951 జనవరి 30, మధ్యాహ్నం 3 గం॥

స్థలం: చిదానందం మేడలో రెండో అంతస్థుమీదగది.

[వెనక గోడకి ఎడమ ప్రక్కగా ఒక కిటికీ వుంటుంది. అది వీధివైపు కిటికీ. ఈ గోడకే గాంధీజీహత్య పటం ఒకటి వుంటుంది. కుడిప్రక్క గోడకి మరొక కిటికీ వుంటుంది. ఇది తోటవైపు కిటికీ. ఇందులోంచి దొడ్లోవేపచెట్టు కనిపిస్తూంటుంది. ఈ కిటికీకి ఎదురుగా ఎడమ ప్రక్క గోడమీద చిదానందం అమ్మమ్మ ఫొటో వుంటుంది. ఆ ప్రాంతంలోనే వంకెకు కోటు ఒకటి తగిలించి వుంటుంది. ఎడమ ప్రక్క మూలవాకిలి - ఈ వాకిలికి అమ్మమ్మ ఫొటోకి మధ్య అద్దం బిగించివున్న ఒంటి రెక్క బీరువా వుంటుంది- 'గాంధీహత్య' పటం క్రింద టేబిలు- దానికిదిగువగా ఒకప్రక్క కుర్చీ, మరో ప్రక్క చిన్నస్టూలు వుంటాయి. టేబిలుకు కుడిప్రక్క పూల కుండీ స్టాండూ వుంటుంది.

కుడిప్రక్క గోడదగ్గర గుమాస్తా టేబిలు- అతనికుర్చీ, టేబిలు మీద అతను మునిగిపోయేటంత ఎత్తున ఫైల్సు వుంటాయి.

తెరలేచేసరికి శివపాదం ఫైల్సులోమునిగి తనపనిలో తాను నిమగ్నుడై ఏదో వ్రాసుకుంటూవుంటాడు. చిదానందం చెప్పేదేమీ వినిపించుకోడు]

చిదానందం:....అదీగాక — నీ డ్యూటీ సంగతల్లా వుంచు— ఈ ప్రపంచంలో నువ్వు నెగ్గటంఎల్లా గన్న విషయం ఒకటి వుందని గుర్తుందా? లేక పోతే, బ్రతికి వున్నన్నాళ్లూ గుమాస్తాగానేపడి వుండాలనా... ఏం?... కాదు — బాగానేవుంది. ప్రతిచిన్న విషయం ఏమరకుండా వుండటం—శ్రద్ధా భక్తులతో పాటుబడటం — ఇవ్వీకావల్సింది. ఎందాకో యెందుకూ — For Example మన సంగతి చూడు - మనం మటుకు మనం ఈ నాటికీ 1st class మాజిస్ట్రేట్ పదవిలోకివచ్చామూఅంటే- వాడుసహాయం చేస్తాడనీ, వీడుసహాయం చేస్తాడనీ గోళ్ళుగిల్లుకుంటూ కూర్చుంటేనే వచ్చామా? .... కష్టపడి, ఒళ్లు దాచుకోకుండా పనిచేస్తే వచ్చాం! ఎండనకా వాననకా - ప్రజలకోసం ప్రజాక్షేమం కోసం - వారి ఆర్థిక నైతిక సాంఘిక పరిస్థితుల పురోభి వృద్ధికోసం అహర్నిశలూ పాటుబడి చమ టోడ్చడం మూలానే - ఈనాటికి ఇంత వాళ్ళం కాగలిగాం! మనతోబాటు తిరిగిన వాళ్ళింకా తిరుగు తూనే వున్నారు మనం మటుకు - ఇదంతా నీ మంచికోసమే చెప్పేది - మనం మటుకు ప్రెసి డెన్సీలో ఎక్కడికి వెళ్ళినా ఇలాంటివాడు 'నభూతో

న భవిష్యతి' అన్న ప్రఖ్యాతి నార్జించ గలిగాం; నిష్పక్షపాతంగా - స్నేహితులూ, విరోధులూ అనే విచక్షణ లేకుండా, న్యాయం, ధర్మం-అందరికీ అందు బాటులో వుండేటట్లు పరిపాలిస్తూ, శ్రీ గవర్న మెంటువారి దృష్టిలో ఇంత మంచి సేవకుడు లేడని మెప్పులు పొందుతున్నాం! చూసి నేర్చుకోవాలంటే ఇలాంటి వాళ్ళనేనోయ్ పిచ్చి శివపాదం, చూచి నేర్చుకోవాల్సింది! అంతేగాని- ఎంత ఆదివారం అయితేమటుకు ఇవ్వాళ ఈ పూట శలవుకావా లనడం ఏమీ బాగుల్లేదు, వచ్చే శుక్రవారం డిస్ట్రిక్టు మాజిస్ట్రేటు ఇన్‌స్పెక్షను కొస్తున్నాడు. రెండు నెలల్నుంచీ ఇచ్చిన జడ్జిమెంట్లు బోలె డింకా వ్రాయ నేలేదు -

[అంటూ గుమస్తావైపు తిరిగి అతను తనమాటలేవీ వినిపించు కోక ఏదో పనిలో మునిగివుండటం చూచి కంఠందాకా వచ్చిన కోపాన్ని దిగమింగుకుని- ]

అయితే శివపాదంగారూ! ఇందాకటి నుంచీ నేను మీ మంచికోసం పడుతూన్న కంఠశోష అంతా చెవిటివాడి ముందు శంఖం ఊదినట్లేనా? ఒక్క ముక్కన్నా మీ చెవిలో దూరలేదన్నమాట!

శివపాదం: [వీనుల విందైన పదసంగీతం చెవులకు సోక డం ఆగిపోగానే ఉలిక్కి పడి తలయెత్తి] ఆఁ-అఁ హఁ- లేదుసార్- దూరిందిసార్- నిజంగానే వింటూనే వున్నాను సార్

చిదా: ఐతే - నేను దేన్నిగుఱించి మాట్లాడుతున్నాను ఇందాకణ్ణుంచీ?

శివ: తమర్ని గురించే కదు సార్ - (తప్పు సవరించు కుంటూ) అదే - మీ విజయ సాధనను గుఱించి, మీరీనాటి కింతవాళ్లైలా కొగలిగిందీనూ -

చిదా : మనం మాట్లాడుతున్నది - నువ్వీపూట పర్మిషన్ కావాలన్నావే - దాన్ని గుఱించి: కిందటి ఆది వారం వాడుకుని వారం రోజులయిందో లేదో అప్పుడే మళ్ళీ అదివారం పర్మిషన్ కావాలా?

శివ : కాదుసార్ -

చిదా : (తనధోరణిలో తను) కిందటిసారి చాలా అర్జంటు పని సార్ అని చెప్పి మంగళగిరి తిరణాలకెళ్లావ్-

శివ : (కాస్త బిగ్గరగా) అదికాదుసార్ -

చిదా : (అదే ధోరణిలో) ఈ సారెందుకో తెలుసుకో వచ్చా ? కోటప్పకొండకైతే చెప్పు!

శివ : (మరింత దిగ్గరగా) ఈపూట మీకు నాతో పనేం లేక పోతే కలెక్టరాఫీసుకు వెళ్ళి ఆడాక్యుమెంట్సు ఇంకా ఎందుకు పంపలేదో కనుక్కుందా మనుకున్నాను సార్—

చిదా : (నిర్ఘాంతపోయి) ఓ - అలాగా -

శివ : అదిలేకపోవడం వల్ల నాకిక్కడ పనేం సాగడం లేదు. ఇప్పుడు మటు కిప్పుడు చూడండి—[డస్టు వైపు చూపిస్తాడు]

చిదా . సరే - సరే - అందుకైతే అదిసరేలే! ఓ యస్ వెళ్ళిరావచ్చు - ఎండకూడా అట్టే తీవ్రంగాలేదు. మధ్యాహ్నం ఓ సారి అలా వెళ్ళివచ్చేస్తే తీరి పోతుంది [డ్రాయరులోంచి చుట్టఒకటితీసుకుంటూ] ఐతే, శివపాదం! నీబుఱ్ఱ ఇంత మంచి విషయాల మీదకూడా పనిచేస్తోందంటే ఇక లేందేం! [చుట్ట నోట్లో పెట్టుకుని] పైకివొచ్చితీరతావన్నమాట! పనంటే శ్రద్ధా, భక్తీ, ధైర్యం - ప్రతిచిన్నవిష యం కూడా ఏమరకుండా వుండటం-[జేబుల్లో వెతు క్కుంటూ] అగ్గిపెట్టె యెక్కడ - ఇవ్వోయ్ నాయనా— ఇవ్వీ జీవితంలో నెగ్గాలన్నా ఓస్థాయి సంపాదించాలన్నా మనిషికి కావలసింది!— అబ్బ బ్బ- ఎక్కడవున్న అగ్గిపెట్టెలూ యీఆడవాళ్ళకే

చాలవ్ [ నిప్పుపెట్టెకోసం అటూ యిటూ చూచి కనిపించక వంకెకు తగిలించివున్న కోటు జేబులో వెతుక్కుంటూ] ఓ పద్ధతి ప్రకారం ఆలో చించటంచేతకాని మనిషున్నాడే, వాడు జన్మలో [శివపాదం మళ్ళీపనిలో మునిగి పోయాడు] ఇలాంటి పెద్ద పెద్ద వుద్యోగాల్లో ఛస్తే పైకిరాలేడు [కోటు జేబులోంచి అగ్గిపెట్టె తీసుకుంటూండగా ఓ కాగితంకూడా క్రింద పడుతుంది, చుట్ట ముట్టించిన తర్వాత క్రిందపడ్డ ఆ కాగితపు మడతను తీసి అను కోకుండానే సాపుచేస్తూ] మరుపు- శివపాదం:— మరుపనేది అసలు మనిషి మరిచిపోవాలి. అప్పుడే మనిషి గొప్పవాడవడం మొదలెట్టేది. ఇదే— [ఆటోమేటిక్‌గా కాగితం మీద వ్రాసివున్నదాన్ని దస్తూరీ తెలియక కాస్త శ్రమపడుతూ చదువుతాడు] Remember Gandhi [అర్థంగాక తిరిగీ చదు వుతాడు] Remember Gandhi!....

[ఏమీ అర్థంకాక కాగితం అటూ యిటూ తిప్పి చూస్తాడు-కాస్సేపు బాధపడతాడు....ఒక ఐడియా తట్టినట్టుంది-కాస్త భయంకరమైన ఐడియాలావుంది ఎవరో ఏవైపునుంచో Remember Gandhi అని హెచ్చరించినట్లు ఫీలయి, ఆ వైపు తిరిగి చూ

స్తాడు. ఎవరూ వుండరు. మళ్ళీ ఇంకో వైపునుంచి– 'Remember Gandhi'. అటుచూచినా ఎవరూ కనిపించరు, 'Remember Gandhi'... అన్ని ప్రక్కల నుంచీ– 'Remember Gandhi' అని అనేక కంఠాలు సంకులంగా అరుస్తున్నట్లు న్నాయి. విచలితమైవున్న తన అంతరాత్మే ఇన్నిటికీ కారణం అని గ్రహించలేని మాజిస్ట్రేటు ముఖంలో వికృతమైన భయం తాండవిస్తుంది. అతని ముఖం చాలా వికారంగా సంకుచిస్తుంది. అతని దృష్టి గోడకుతగిలించివున్న 'గాంధీజీహత్య' ఫొటోమీద పడుతుంది, గబగబా మూడుసార్లు పిస్టలు పేలినట్లు కూడా ఊహించుకుంటాడు. కుర్చీలో కూలబడి మాట పెగలని కంఠస్వరంతో శివపాదాన్ని అడుగుతాడు]

ఇవ్వాళ తారీకేమిటి? [పనిలో మునిగివున్న శివపాదం సమాధానం ఇవ్వడు] ఇదుగో - శివపాదం! నిన్నే - ఇవ్వాళ తారీకు - ?

శివ : [సరిగ్గా తలయెత్తకుండానే] ముప్పయ్‌సార్

చిదా : ముప్పయ్! జనవరిముప్పయ్ –

[మళ్ళీ కాగితం వంక చూస్తూ భయంతో జీరపో యిన కంఠంతో] గాంధీని జ్ఞాపకం తెచ్చుకో [బిగ్గరగా] ఐతే నన్ను హత్య చేస్తారన్నమాట! వాళ్ళునన్ను హత్య చేస్తారన్నమాట!

శివ : ఏమిటిసార్ - ఏమిటి ? [శివపాదం ఆశ్చర్యంతో తలయెత్తి చూస్తాడు]

మనుష్యులమీద జడ్జీగా వుండట మంటే యిదీ! [అతని మేకపోతు గాంభీర్యమంతా ఆందోళనలో కరిగి నీరై పోతూంది] న్యాయానికి ముఖద్వారంగా వుండట మంటే యిదీ!

శివ. ఏమిటిసార్ - అదీ?....ఏమిటి?

చిదా : నేనిక జాగ్రత్తగా వుండకపోతే ఇదే నా మరణానికి నోటీసు! ........ ఈ మధ్య మనం విచారించిన కేసులేమిటి?

శివ ! ఆ రైటింగ్ కేసొకటి –

చిదా : ఆఁ – ఆ రైటింగ్ కేసొకటీ – అందులో వాళ్ళి వ్వబోయిన లంచం నే పుచ్చుకోలేదు. అదీగాక ఆబ్లాక్ మార్కెటింగ్ కేసొకటి వుంది - అందులో న్యాయ విరుద్ధంగా రాజీపడ్డ రెండు పార్టీలకీ నే

నంటే మంటే! వెధవ ప్రజలు, - నేను చేసింది వాళ్ళమంచికోసమేనని తెలుసుకుని యేడిస్తేగా!

శివ : ఏదన్నా ఆకాశరామన్న వుత్తరమా యేమిటిసార్, ....ఎక్కణ్ణుంచి వచ్చింది,

చిదా : ఎక్కణ్ణుంచి ఎప్పుడు వచ్చిందోగాని ప్రస్తుతం నా జేబులోమాత్రం వుంది. ఎవడో....ఆఁ-అవు నవును. జ్ఞాపకం వచ్చింది. నిన్న కోర్టునుంచి వచ్చేటప్పుడు ఎవడో నన్ను రాచుకుంటూ వెళ్ళాడు. చాలా పొట్టి గా వుంటాడు- పిల్లికళ్లూ. మొహంనిండా స్ఫోటకం మచ్చలూ- ఉంగరాలు తిరిగిన రాడీ క్రాపూ వాడూనూ—

శివ : ఏం రాశాడు సార్! కాగితంలో,?

చిదా ; [అదేం వినిపించుకోక] కోర్టులోంచి బయటకొచ్చి రోడ్డెక్కానోలేదో— సరిగ్గా అప్పుడే! ఆఖరికి క్షమించమని అడగడానిక్కూడా వెనక్కి తిరిగి చూడకుండా వుడాయించేశాడు..... అవును - నాకు బాగా జ్ఞాపకంవుంది....సరే—ఈ మాత్రం హెచ్చరికైనా యిచ్చినందుకు వాళ్ళకి Thanks! ఓ వేళ నాకు నూరేళ్లూ నిండకుండా ఛస్తే ఛస్తానేమోగాని- ఇవ్వాళ మట్టుక్కాదు. .... ఇదుగో శివపాదం!

వెంటనే క్రిందికి వెళ్ళి తలుపులూ కిటికీలూ అన్నీ మూసేసి ఘడియలు వేసెయ్. తాళాలుకూడా వెయ్. ఊఁ—వెళ్ళు. ఇదిగో, మాట....అమ్మగార్నోసారి అర్జంటుగా నాదగ్గిరికి రమ్మని చెప్పు .... ఆఁ— ఇంకోటి— ఇంట్లో కొత్తవాళ్లెవళ్ళన్నా వున్నారా? పనిచేసేవాళ్లూ వాళ్లూనూ?—

శివ : గోడలకు సిమెంటు చేస్తూన్న తాపీవాళ్లిద్దరు తప్ప ఇంకెవరూలేరు సార్!

చిదా : వాళ్ళని పంపించెయ్—

శివ : వాళ్లైనా అవతలహాల్లో వున్నారుసార్

చిదా : పంపించెయ్—వాళ్లనికూడా పంపించెయ్, ఆ చేస్తూన్నపని అలావదిలేసి వెళ్ళిపొమ్మను.... వాళ్ళని పంపించి మరీ తలుపులు వెయ్—జాగ్రత్త- కిటికీలన్నీకూడా— [శివపాదం చాలా వేగంగా తలుపు తెరుచుకుని పోతాడు. తలుపు మూసుకునేలోగా— "ఏయ్ తాపీమనిషీ! అయ్యగారు చెప్తున్నారూ—" అనిమాత్రం వినిపిస్తుంది. ఒంటరిగావున్న చిదానందం అనుమానంతో కిటికీ లన్నీ ఒకదాని తర్వాత నొకటి చూస్తూ కాస్త Relax అయి సరాసరి బీరువా దగ్గరకు వచ్చి ఏదో తట్టి రెండడుగులు వెనక్కి—

వేస్తాడు. బీరువాని భయాకుల దృష్టితో చూస్తాడు. డ్రాయర్లోంచి పిస్టలు తీసి బీరువాకి గురిపెట్టి] బైటికిరా! ఊఁ—నీ చేతులోవున్న ఆయుధం తక్షణం కిందపడేసి బైటికిరా.... [నిశ్శబ్దం]....వస్తావా-లేకపోతే Shoot చెయ్యమంటావా? [సమాధానం ఏమీరాకపోవడంవల్ల నెమ్మదిగా బీరువాదగ్గరకు వెళ్ళి నెమ్మదిగా తాళంచెవి పెట్టి తిప్పి గభాలున తలుపులు తెరుస్తాడు. ఛీ! సిగ్గుపడి త్వరత్వరగా పిస్టలు డ్రాయర్లో దాచేస్తాడు. పార్వతి వస్తున్న సవ్వడి.]

పార్వతి: (లోపల్నుంచే) ఆతాపీవాళ్ళెక్కడికెళ్ళారో ఆ ఇసుకా సున్నం అంతా ఎక్కడిదక్కడవదిలేసి?.... [వస్తుంది, అందంగానే వుంటుంది- నిజంగా గృహలక్ష్మి. తెలివితేటలుగలముఖం] ఆఁ-ఏమండీ ఎందుకు పిలిచారట? చెప్పండి బాబూ త్వరగా. పప్పు నానబోయించాను, ఇంకా రుబ్బించి వడియాలు పట్టించాలి.

చిదా : [ఆమెదగ్గిరికి వెళ్ళి చేయితీసుకుని ధైర్యం చెప్తున్నట్లు] మరేం భయపడకు పార్వతీ—

పా : భయం ఎందుకూ?

చిదా : నీ భర్త ప్రాణాలు చాలా విషమాపాయస్థితిలో వున్నాయి పార్వతీ!

పా ; ఆఁ—నిక్షేపంలాంటి కోకోత్రాగి, విషం- విషం కలిపారెవళ్లో నని గాఁవుఁ కేకలెట్టారు మొన్న. ఈ సారేమిటో ఆ అపాయం!

చిదా : [ఆమెఆకతాయితనాన్ని ఒక్కమాటతో కట్టిపెట్ట దలచి] హత్య!

పా ! ఎవర్ని?

చిదా : ఇంకెవర్ని పార్వతీ?

పా ! మిమ్మల్నే?....ఐతే మీకోరిక ఫలించిందన్నమాట! అప్పుడే- అంత గొప్పవాళ్లై పోయారా? ఎప్పుడూ గొప్పవాళ్ళం కావాలి - గొప్పవాళ్ళం కావాలి అనే వారు - ఇంకేం!

చిదా : అంటే నీ వుద్దేశం?

పా : కావలసినంత పేరు ప్రఖ్యాతు లార్జించిన మహా మహుల్ని కాక ఎవరో అల్లాటప్పుల్ని హత్యచెయ్యడానికి ఎవరు సమకట్టుతారూ అని!

చిదా : ఇదుగో ఇది చదువు [కాగితం ఇచ్చి] ఇంకా ఎగతాళిగానే వుందానీకు?

పా : నేను మాట్లాడేది మీకు ఎగతాళనిపించిందా, [కాగితం చదవడానికి ప్రయత్నిస్తూ] ఓహ్- ఏం రాతరా బాబూ- బ్రహ్మరాత!

చిదా : ఎవడో విద్యావిహీన పశువు విషహస్తం! లేకపోతే అంతవక్రంగా ఎందుకేడుస్తుందీ,

పా : [ఇంకా చదవడానికి ప్రయత్నిస్తూనే] ఏమిటీ-?.... (విసుగుబుట్టి) నాకేంతెలీటంలేదు [అని కాగితం ఇచ్చేస్తుంది]

చిదా : 'Remember Gandhi' అంటే-గాంధీని జ్ఞాపకం తెచ్చుకోమని!

పా : అదేమన్నా సమస్యాయేమిటి?.... మిమ్మల్ని పూరించమనా?

చిదా - సమస్యకాదు- Death Warrant! ఇవ్వాళ ఏమిటో తెలుసా నీకు,

పా : ఆదివారం.

చిదా : అదికాదు - తారీఖు,

పా : ఇరవైమూడో ఇరవై నాలుగో ననుకుంటాను.

చిదా : ముప్పయ్!- ఇవ్వాళ జనవరి ముప్పయ్యోతారీఖు!

పా : హారిదేముడా! ఇవాళే మీ చిన్నచెల్లెలు కూతురు పుట్టిన రోజు. ఆఖరికింత వుత్తరంముక్కన్నారాయలేదు చూశారా మనం!

చిదా : అబ్బబ్బ - ఇవతలమొత్తుకొనేది వినిపించుకోకుండా ఏమి టేమిటో ఆలోచిస్తూంటావేమిటి, పార్వతీ నువ్వు? ....జనవరి ముప్ఫయ్యోతారీకున గాంధీగారు ప్రార్థన వేదికదగ్గర హత్య - హత్యచెయ్యబడ్డారు!

పా : అవునవును. జ్ఞాపకంవచ్చింది. ఆయన పోజులూ పోకడలూ భరించలేకపోయారన్నారు.

చిదా : ఆయన మహాత్ముడు,

పా : అవునండీ, కాదనెవరన్నారు? .... [కాగితంవంక చూస్తూ] ఐతే మిమ్మల్ని కూడా ఎవరన్నా హత్య చెయ్యాలనుకుంటున్నారా?

చిదా : ఇంకా అర్థంకాలేదా పార్వతీ?

పా : అసలింతకు ముందే ఎందుకు చెయ్యలేదా అని! [అతని ముఖంలో ఆశ్చర్యం పూర్తిగా ద్యోతకం కాకముందే] అఁహఁ- మాజిస్ట్రేట్లంటే చాలా మందికి అసహ్యమనుకుంటాను. అందులోనూ మీరు మహాస్ట్రిక్టట కూడానూ—!

చిదా : న్యాయశాస్త్రమే-[నాపిచ్చి] పార్వతీ—న్యాయశాస్త్రం Strict గావుండేది! నేను మాజిస్ట్రేటుని మాత్రమే గాని మంత్రగాణ్ణి కాదు. ఒకళ్ళని మెప్పించడం కోసం నే నెప్పుడూ 'లా' కి పెడర్థాలు తియ్యలేదు

వాళ్లేరుకున్న ఈ రోజున చచ్చిపోయి వాళ్ళని మె
ప్పించనుకూడానూ!

పా. అవునవును—అదినిజమే. మీరివ్వాళ అసలు వాకిలి దాటి వెళ్లొద్దు ఎందుకైనామంచిది- ఇంట్లోనే కూర్చుని హాయిగా-

చిదా: శివపాదాన్ని పంపించాను తలుపులూ కిటికీలూ అన్నీ వేసి తాళాలుకూడా వేసిరమ్మని. క్రిందితలుపులన్నీ కూడా మూసేస్తే బాగుంటుందనుకుంటా,

పా: తలుపులన్నీ మూసుక్కూచుంటే గొల్లదివచ్చి పాలు పోయడం ఎలా?

చిదా: అబ్బ—ఒక్కక్షణమైనా మర్చిపోలేవా పార్వతీ ఆ వెధవపాలూ వడియాలూనూ? నీభర్తప్రాణాలకంటే యెక్కువా అవ్వి?

పా: మళ్ళీ రాత్రికి పాలులేవని తిట్టుకునేది మీరూ:........ అయినా ఇది మిమ్మల్నే ఉద్దేశించి రాశారని దాఖలాయేమిటి?

చిదా: అదినాజేబులో వుండటమే! [త్వరత్వరగా] నేను కోర్టులోంచి బైటికొస్తూంటే నన్ను రాచుకుంటూ పోయి నా జేబులో పడేశాడో వెధవ! నల్లగా పొట్టిగా- వెధవమొహం వాడూనూ - చాలాదుర్మార్గుల్లావుంటే!

పా : మరీ మీరనుకున్నంత దుర్మార్గుడు కాదేమోలేండి.

చిదా : నీకేం తెలుసు,

పా : మీకీమాత్రం వార్నింగ్ ఇచ్చాడంటే చూడండిమరి. లేకపోతే యే షికారుకో వెళ్ళినప్పుడు సమయం చూసి వేసేవాడో యేటు– ఆదెబ్బతో సాయంత్రం లోగానే నేనీ ప్రపంచంలో నిరాధారనైన వితంతువునై ....

చిదా : [కుర్చీలో కూలబడుతూ] అబ్బ—వూరుకో పార్వతీ! అసలే నాగుండె బ్రద్దలైపోతూంది- [ఇంటిచుట్టూతా పరుగెత్తి చెమటోడ్చుకుంటూ శివపాదం ప్రవేశిస్తాడు]

చిదా : (ఆదుర్దాతోలేచి) వచ్చావా - తలుపులన్నీ వేశావా? కిటికీ లన్నీ మూశావా? పనివాళ్ళందర్నీ—

శివ : [కాస్త తటపటాయిస్తూ] వంటయింటి కటకటాల తలుపులు మాత్రం—

చిదా : [కోపంతో] ఊఁ— మాత్రం!

శివ : (త్వరత్వరగా చెప్పలేక) వంటమనిషి అనుకుంటోందనుకుంటానూ- అంటే - ఆవిడ అన్నదిగదా—

చిదా : చెప్పవోయ్ బాబూ- తొందరగా తెమిల్చి చెప్పు—నాన్చక. ఏమందీ ఆవిడ,.... అయినా అసలావిడ

ఏమనుకుంటేమటుకు తలుపులన్నీ ముయ్యమన్న
నా ఆర్డరుకేమి టభ్యంతరం?

శివ : [త్వరత్వరగా చెప్పాలని ప్రయత్నిస్తూ] వంటమని
షన్నదిగదా-తనేమో చాలా వరుసూ మర్యాదావున్న
మనిషిట- ఇంతవరకూ జన్మలో ఎన్నడూ ఖైదీ
లాగా కటకటాల వెనక వుండలేదు - ఇన్నేళ్లొచ్చి
ఇప్పుడు మొదలెవతానాఅంది. ఎవరన్నా తలుపు
వాయలకొచ్చాడంటే వాడికి సమాధానం చెప్పడం
తనకి చేతనవునట!—

పా : సరే—నేవెళ్ళిచెప్తాలే ఆవిడతో..

విశా : [అడ్డంవస్తూ రౌద్రంగా] దానికేమన్నా మతి
పోయిందా యేమిటి? (శివపాదంవైపు తిరిగి) తలు
పులన్నీ భద్రంగా వెయ్యకపోతే తన యజమాని
ప్రాణాలకే ముప్పువస్తుందని చెప్పావా?

శివ : చెప్పానుసార్ - చెప్పాను. నేను వెంటనే వంటిం
ట్లోంచి కదలకపోతే ఎవరో ఒకరిప్రాణాలకి ముప్పు
వచ్చేమాట నిజమేనంది సార్.

పా : ఫర్వాలేదులే శివపాదం. పాపం- ముసలి ముండ
పని చేసి చేసి విసుగెత్తి పోయివుంటుంది. నే చెప్పి
వొప్పిస్తాగా—

విదా : చెప్పి ఒప్పిస్తావ్? మనమాటకి వచ్చినట్లు ఒప్పుకుని తీరాల్సిననౌకరు ముండా వాళ్ళకి చెప్పి ఒప్పించడం ఎక్కడున్నదే? అది ఈ క్షణంలో ఉద్యోగానికి నీళ్ళు వదులుకుని వెళ్ళిపోవాల్సిందే!

పా : అబ్బ—మీరు ఊరికే హైరాన పడకండీ. దానిమనసేదో దాగుండదేదల్లేవుంది. అసలు వంటమనుషులంతా అంతే—పొయ్యిముందు కూర్చుని పొగ ఊదివూది తిరగమూత వాసనలు చూసిచూసి పాపం అలా అయిపోతూంటాయి వాళ్ళమనస్సులు. నే వెళ్ళి చెప్తాగా—

విదా : ఊం—తక్షణం వెళ్ళి చెప్పు. యజమాని ప్రాణాలంటే లక్ష్యంలేని మనుషులకి అతనియింట్లో ఏ మాత్రం స్థానంలేదని చెప్పు. వెంటనే దానిమూటా ముల్లే సర్దుకు చంకన బెట్టించి బైటికి నడిపించి తలుపులు ఘడియలు వేసెయ్.

పా : ఆఁ—ఆవిడపోతే ఇక వంటంతా ఎవరు చేస్తారు? ఇవ్వాళమటుకివ్వాళ ఆ వడియాల పిండి అంతా ఎవరు రుబ్బుతారుబాబూ?.... మీ కెందుకు మీరూరుకోండి. ఆవిడచేతనే కటకటాల తలుపు వేయిస్తాగా నేను. మీరన్నట్టు కిందకూడా కిటికీతలుపులూ అన్నీ

సరిగ్గా వేళారోలేదో చూసివస్తాను [వెళ్తూవెళ్తూ ఆగి] అన్నట్టు ఆ తాపీవాళ్ళు తెచ్చి పోసినసున్నం వుంది. మొన్న పందికొక్కులుతవ్వి పెద్దదిచేసిన తూముకూడా మూసేయించమంటారా?

విదా : [వచ్చిన కోపాన్ని అపుదుంటూ బాధతో] ఓచెంప ఇక్కడ ప్రాణాలమీది కొచ్చి ఆందోళనతో ఛస్తూంటే నీకు వేళాకోళంగా వుందా? ఇది నీకు తగదు పార్వతీ!

పా : నేనన్నది వేళాకోళమా? ఏంచిత్రమండీ! ఇనప చువ్వలున్న కిటికీల్ని సహా మూసేసి గాలిమూరే సందులేకుండా బందోబస్తుచేసి మారిస్ మైనర్ కారుతో సహా లోపలికి దూరటానికి వీలైనకన్నం పూడ్చకుండా పెట్టుకు కూర్చోవడం నాకేంబాగోక అన్నాను. సరే ... మీయిష్టం!

[అని పైటికివెళ్ళి, మళ్ళీ వచ్చి బీరువాలోవున్న కొవ్వొవత్తులూ ఒక చిన్న కిరొసినాయిలు లాంతరూ తీసుకుని వెడుతూ వుంటుంది]

విదా : అవ్వెందుకు?

పా : కిటికీలన్నీ కూడా మూసుక్కూచుంటే చీకట్లో ఇవైనా లేకపోతే యెలామరి? (వెళ్ళిపోబోతూ ఆగి)

అగ్గిపెట్టె ఎక్కడ? (అటూ యిటూ చూస్తుంది. కనిపించదు. శివపాదం టేబిలుమీద పుస్తకాల Rack చాటున పడ్డ అగ్గిపెట్టె తీసి అందిస్తాడు. అది తీసుకుంటూ—) ఎక్కడవున్న అగ్గిపెట్టెయినా ఈ మగవాళ్ళకేచాలవ్ (అని వెళ్ళిపోతుంది.)

చిదా. అబ్బబ్బ - నిజంగా ఈ ఆడవాళ్ళున్నారే - ఏం మెటి క్యోగాని వీళ్ళవి:- ఇలా అనవసరపు వ్యర్థ విషయా ల్ని గురించిన ఆలోచనలకి ఎలా తావిస్తారోగాని ఛీ ఛీ ........ | మరోవైపుతిరిగి ఆలోచిస్తూంటాడు | పందికొక్కులు పెద్దదిచేసిన తూము .......... పందికొక్కులు పెద్దదిచేసిన తూము .......... [తను బిగ్గరగా ఆలోచిస్తూ అనుకుంటూన్నది వింటూ Watch చేస్తూన్న శివపాదాన్ని చూసి | ఇహ నీ పనేమిటో నువ్వు చూసుకోరాదూ?

శివ: మీరింత కొండంత ఆపదలో వుండగా నాకు పనెట్లా సాగుతుంది సార్? నాకేమిటో అంతా గాబరాగా వుంది. నేను చెయ్యగలిగిందేమన్నావుంటే—

చిదా: (తను ఇలాంటివాటికి జడిసేరకం కాదన్నట్టు) ఆఁ-ఆఁ. నాన్సెన్స్. నన్నెవళ్లేంచెయ్యగలరు లేవోయ్-నీపిచ్చిగాని.

శివ : పోనీ నేను వెళ్ళి పోలీసులకి చెప్తే—

చిదా : No - No - No -

శివ : పోనీ, రిజర్వు పోలీసుల్ని—

చిదా : (చాలా ధైర్యాన్ని అధిరోయిస్తూ) No–No-No- యిహ బ్రతికినన్నాళ్ళూ తోకలా అంగరక్షకుణ్ణొకణ్ణి వెంటబెట్టుకు తిరగమంటావా? అదేం కుదరదుగాని నీపని నువ్వూ ........ [అతనిదృష్టి పూలకుండీ స్టాండుమీద వున్న ఒక పార్సెలు మీదపడుతుంది. అదిసుమారు 8″ × 5″ × 6″ వుంటుంది. చుట్టూ తా తాడుకట్టి వుంటుంది. దాన్నిచూసి ప్రాణం గతుక్కుమని ] అదేమిటి?

శివ : ఇవ్వాళ ప్రొద్దున వచ్చిందిసార్ మీకని.

చిదా : ఏమిటది?

శివ : (తనకేనమ్మకంలేనట్టు నానుస్తూ) నాకు తెలీదుసార్. ఓ మనిషి వచ్చి అదిచాలా అవసరమైందనీ, ప్రత్యేకంగా మీ కందజెయ్యాల్సిందని చెప్పి యిచ్చి పోయాడు సార్.

చిదా : అంతేగాని- అదేమిటో మటుకు నువ్వడగలేదన్న మాట!....మాట్లాడవేం బెల్లంకొట్టిన రాయిలా?.... వెధవబుద్ధి!—మట్టిబుద్ధిని!—

శివ : 'కాదుసార్. తమరికి ఎవళ్ళేం తెచ్చియిస్తూంటారో అది నా కెందుకని అడగలేదు సార్. అదీగాక - అదిరాగానే మీకు చూపించాను కూడానూ. మీరే అక్కడ వుంచెయ్యమన్నారు.

చిదా : [దానివంక చూసిన కొద్దీ ఎక్కువవుతూన్న గుండె దడతో] అదితెచ్చిన మనిషి? ....వాడెల్లా వుంటాడు చూట్టానికి? పొట్టిగా వుంటాడా—నల్లగా?

శివ : [వాడెలా వుంటాడో నిజానికి గమనించకపోయినా] పొట్టిగానే వున్నాడనుకుంటానండి – నల్లకళ్ళజోడు పెట్టుకుని నెత్తిన ముసుగేసుకున్నాడు ... ఆ— గడ్డంమీద పుట్టుమచ్చ ఒకటి వున్నట్టుందనుకుంటాను సార్....నేనంత ఖచ్చితంగా చెప్పలేనుగాని.... అయినా అది—

చిదా : పుట్టుమచ్చా? [అతని ఆలోచన కళ్ళెంలేని గుఱ్ఱంలా పరుగెత్తుతుంది] పుట్టుమచ్చ! అవునవును. వాడికూడా పుట్టుమచ్చవుంది-నన్ను రాచుకుంటూ వెళ్ళాడనిచెప్పానే వాడికి! గడ్డంమీద కుడిపక్కగా వుంది. అబ్బ- ఇంకా కళ్ళకట్టినట్టు కనిపిస్తూంటే ఐతే శివపాదం!.... ముందీపీడ వదిలించుకోవడం ఎలా?.... ఎలాగైనా తక్షణంబయట పడాలీ అపాయంలోంచి మనం ...

శివ : ఇదేమన్నా చాలా అపాయం అంటారా? ...ఏమిటి చెయ్యడమబ్బా!....

విదా : [ప్రక్కనవున్న కిటికీ నిర్దేశిస్తూ] ఆ కిటికీ తెరు. తోటలోకి దూరంగా విసిరి పారేస్తాన్నేను

శివ : అలా విసిరి పారేస్తే మరీ - అందులోవున్న దేమన్నా ప్రేలిపోతుందేమో సార్.

విదా : అవతలికి విసిరెయ్యకపోతే ఇక్కడే ప్రేలితే?.... అసలిది ఎంత సేపట్నుంచీ వుందిక్కడ?

శివ : పొద్దున ఏ తొమ్మిదింటికో వచ్చింది సార్.

విదా : ఆరిబాబో! ఐదు గంటల్నుంచీ ఇక్కడపడి వుందన్నమాట: తెరవ్వయ్యా బాబూ!--- కిటికీ తెరు--- ఏక్షణాన పేలుతుందో అది—

శివ ! వొద్దుసార్. మీరే కిటికీ తెరవండి. అదేదో నేనే పుచ్చుకుని బయటకు పారేస్తాను. నాదేముంది – అల్పప్రాణం మీప్రాణం దేశానికి చాలా అమూల్యమైంది.

విదా : కాదు శివపాదం, కాదు. నువ్వింకా చిన్నవాడివి. ఐపోయింది- నేను వచ్చిన పనైపోయింది. ఇంకా చాలా గొప్పపనులు చెయ్యాల్సిన వాడివి నువ్వు బ్రతికి తీరాలి. బ్రతికి నా జీవితాన్ని ఓపెద్ద చరిత్ర

గా రాసెయ్.... నామాట విను. మా బాబుకదూ—
నే చెప్పినట్లు కిటికీ తెరువు. చాలా జాగ్రత్తగా
వ్యవహరిస్తానుగా ఈ విషయంలో!
[శివపాదం కిటికీ దగ్గరకు పోతూండగా]
అఁహఁహఁ- వొద్దు- వుండు. ఇంకో మంచి ఆలో
చన తట్టింది.... ఆఁ—ఆ తాపీవాళ్ళు తెచ్చుకున్న
నీళ్ళబకెట్ ఇంకా ఆ వరండాలోనే వుందా?

శివ : వుందిసార్- [అనివరండాలోకి వెళ్తూండగానే]

చిదా : ఊఁ—[అనితొందరపెడతాడు]
[శివపాదం వరండాలోకి వెళ్ళి బకెట్ తీసుకుని
గబగబా తిరిగి వస్తాడు. బకెట్‌లో కాసిని నీళ్ళు
వుంటాయి.]

చిదా : నీళ్ళల్లో నానితే పనిచెయ్యదుకదూ.... నువ్వెటంగా
నుంచో- ఇంకొంచెం వెనక్కి- [చాలాభయపడుతూ
వణకుతూన్న చేత్తో ఆ పార్సెలు ఎత్తుతాడు] ఎంత
భయంకరమైన సంఘటన జరిగిపోతుందో యిప్పుడు!
[చెయ్యిపూర్తిగా జాపి బకెట్‌కు సాధ్యమైనంత
దూరంలో వుండి తల ఈ ప్రక్కకి తిప్పి కను
కొలుకుల్లోంచి చూస్తూ బకెట్‌లో పెడతాడు] అరె-
ఇందులో నీళ్ళు సరిపోలేదోయ్ - ఇది పూర్తిగా
మునగటంలేదిందులో.

శివ : వెళ్ళి తీసుకొస్తానుసార్. ఇప్పుడే క్షణంలో తీసుకొస్తాను బిందెతో.

చిదా : వొద్దు. నువ్విక్కణ్ణుంచి వెళ్ళొద్దు....అదుగో - ఆ పూలకుండీ—

శివ : ఆఁ—అవునవును. [కుండీలో పూలన్నీ తీసి ఆదుర్దాతో త్వరత్వరగా టేబిలుమీద పారేసి అందులో నీళ్ళు బకెట్ లోంకి వొంచుతాడు] ఆఁ—ఫరవాలేదు. మునిగి నట్లేసార్.

చిదా : ఇదిగాని తేలిపోతుందేమో-నీళ్ళల్లో నిలిచి నానిపోతే బాగుండును.

శివ : ఏదన్నా బరువుపాటిది దానిమెత్తిన పెడితే సరిసార్.

చిదా : ఆఁ ఆఁ- ఏదన్నా తీసుకురా మరి.

శివ : ఏం తీసుకొచ్చేది సార్ ?

చిదా హారిభగవంతుడా ! ఇదేమన్నా పూలచెండనుకున్నావటయ్యా - చేతిలో బాంబుపెట్టుకుని గుండెపగిలి ఛస్తూవుంటే ఆలోచనే తట్టదేమయ్యా- వెధవ మట్టిబుఱ్ఱా నువ్వూనూ - తీసుకురావయ్యా ఆ పుస్తకాలన్నా నాలుగు.

శివ : పుస్తకాలా? లాబుక్స్ సార్- తడిసిపోతయ్.

చిదా : వెధవవాగుడు కట్టిపెట్టి ఆ క్రిమినల్ ప్రొసీజరు కోడూ - ఎస్టేట్ లాండ్ ఆక్టూ తీసుకురావయ్యో బాబూ.

శివ : [Rack లోంచి తీసుకువస్తూ] చక్కటి బైండ్లు - మొన్ననే చేయించాంకూడానూ [చాలావిచారంతో పుస్తకాలు రెండూ బకెట్‌లో పెడతాడు పార్సెలు మీద]

శివ : [బకెట్‌లోంచి చెయ్యితీసుకుని విదిలించుకుంటూ వెనక్కి అడుగులు వేస్తూ] అమ్మయ్య - ఇప్పటికి పూర్తిగా మునిగినట్లే. [అని నుదుటిమీద చెమట తుడుచుకుంటాడు శివపాదం. ప్రక్కనే వున్న కుర్చీలో కూలబడతాడు. ఒక్కక్షణం అవకాశం. పార్వతి ఒకట్రేలో కాసిని బిస్కట్లూ, కాఫీ తీసుకుని ప్రవేశిస్తుంది]

పా : [అంతా కలయజూచి] ఏమిటండీ ఇదంతా, ఆ బకెట్ ఎందుకూ, ఏమిటందులో?

చిదా : ఇవ్వాళ ప్రొద్దున వచ్చిన పార్సెలు! అది తెచ్చిందేవరో తెలుసా? వాడు! ... నిన్న నన్ను రాచుకుంటూపోయి ఆ కాగితం నాజేబులో వేశాడని చెప్పానే- వాడు! వెధవలు- ఆ పార్సెలు నే విప్పి

తాననుకున్నాడు - బుద్ధిలేకపోతేసరి. (కాస్త హుషా రెక్కి) నేనా వాళ్ళ కందేది! హుఁ ఇంతమాత్రానికే యిల్లాంటి వాళ్ళ టోపీలో పడేవాణ్ణే అయితే అస లింతవరకూ వచ్చేవాణ్ణా నేను? అపరిమితమైన జాగ్రత్త- ముందూ వెనకా ఆలోచన- జీవితంలో నెగ్గాలంటే ఇల్లాంటి వెన్నో కావాలి పార్వతీ! శుద్ధ తెలివితక్కువ దద్దమ్మ ననుకున్నారు—హుఁ—

పా : [కాస్త ఎగతాళిగా] ఆ - కనిపిస్తూనే వున్నయ్ తెలివితేటలు. నిక్షేపంటాంటి సరికొత్త—

చిదా! [చాలా కోపం వచ్చి] పార్వతీ! [పిడుగులాంటి పిలుపు పార్వతిని నోరెత్తనీకుండా ఆపుజేస్తుంది.] ఇవతల నీప్రాణేశ్వరుడి ప్రాణాలే పరమా పాయ పరిస్థితిలో వుంటే మొన్న మీ అమ్మ కొనియిచ్చిన ఈ నీ సరికొత్త తివాసీ తడిసి పాడైపోయిందనా నీ విచారం? నిజంగా నిన్ను చూసి చాలా ఆశ్చర్య పడుతున్నాను పార్వతీ !

పా : [అసలు తివాసీని గురించే మాట్లాడబోని పార్వతి] తివాసీ? [కాస్త ఆగి నెమ్మదిగా] లేదు - నాకా విచారమే లేదండీ. మీరు కులాసాగా వుంటం ఒక యెత్తూ, మిగతా ప్రపంచం అంతా వొకయెత్తూనూ

నాకు....రండి- కాస్త కాఫీతీసుకోండి [ట్రే బల్ల మీదపెట్టి అక్కడ పడివున్న పూలన్నీ యేరుతూ] ఐనా మీరలా వుద్రేకపడటం యెందుకు చెప్పండి. డాక్టరుగారు ఎన్నిసార్లు చెప్పారు. మీకు ఉద్రేకం పనికిరాదు- అసలే అదురుగుండెలని?

చిదా : ఆఁ - ఆ డాక్టరు ఇంటిక్కూడా ఎవడో వచ్చి ఏ హైడ్రొజన్ బాంబో వేసి పోతే అప్పుడు తెలుస్తుంది. ఆయనకీనూ వుద్రేకం సంగతి.

పా : [వంగి, క్రిందపడ్డ నీళ్ళన్నీ తుడుస్తూ బకెట్‌లోని వస్తుసముదాయాన్ని ఆశ్చర్య పూరితురాలై చూస్తుంది]

శివ : [ఏదో పెద్ద ఘనకార్యం చేసినట్టూ ఇలాంటి ఘనకార్యాలు మామూలేనన్నట్టూ బకెట్‌వంక చూస్తూ] అంతా నానా కంగాళీచేసినట్టున్నాం.... మీరెందుకు మీ రూరుకోండమ్మగారూ, నేను చూస్తానాసంగతి.

పా : ఏకంగా న్యాయశాస్త్రాన్నే ముంచేశారే మాజిస్ట్రేటుగారూ గుమాస్తాకలిసి!

శివ : ఆఁ — అదే. ఆపార్శిలు తేలిపోతుందేమో ననిపించింది అయ్యగారికి. ఆలస్యమైతే అమృతమే విషమైపోతుంది- అసలు విషం ఇంకెంత పవర్‌ఫుల్ అవు

తుందో నని చేతికందిందేదో తీసుకుని దాని నెత్తిన వెయ్యాల్సివచ్చింది.

పా : ఓహో! [తడిగుడ్డ, పూలు అతని చేతికిచ్చి] పీటిని కాస్త కింద పారెయ్యండి. ఇందులో ఇంకాసిని పూలుకూడా పెట్టుకు రండి దేవుడి గదిలో వున్నా యి కింద [ఖాళీ అయిన పూలకుండీకూడా అంది స్తుంది]

[శివపాదం అన్నీ తీసుకుని వెళ్తాడు]

చిదా . ఇప్పటికైన ఒప్పుకుంట ఆ ఒప్పుల కుప్ప తన పాక గృహ మహారాజ్య పరిధిద్వార బంధనానికి?

పా : ఒప్పుకోక ఏంచేస్తుంది- నే చెప్పానుగా! (చిదానందం కాఫీ చప్పరిస్తూంటాడు. పార్వతి బిస్కట్ తీసి అం దిస్తూ) ఇవ్వితీసుకోండీ—

చిదా : [తింటూ] నిజానికి నేనింత ప్రాణాపాయ పరిస్థితి లో వుంటే యీ కొంపలో ఎవళ్ళకీ చీమకుట్టిన ట్లైనా లేదన్నమాట!

పా : (అదేం వినిపించుకోక తోటవైపు కిటికీ కెదురుగా గోడమీద వ్రేలాడుతూన్న ఫొటోకేసి చూస్తూ)

ఏమండీ.... మీ అమ్మమ్మ ? ఫొటో అక్కణ్ణుంచి తీసేస్తే బాగుంటుందేమో?

చిదా : ఎందుకూ ? మీ అమ్మమ్మ ఫొటో పెడ్తే బాగుంటుందనా ?

పా : ఆ కిటికీలోంచి వచ్చేవాటికి సరిగ్గా ఎదురుగావుంది.

చిదా : కిటికీలోంచి వచ్చేవి ఏమిటో తెలుసుకోవచ్చా

పా : మీ వస్తువే పాడై పోతుందని చెప్తున్నానండీ: ఆ దొడ్లో ఎవడైనా వేపచెట్టెక్కి చేతిలో పిస్టలు పెట్టుకూర్చుంటే —

చిదా : (అదిరిపడిలేచి) వేపచెట్టా? .... వేపచెట్టు.... వేప చెట్టుమీద నుంచా ...అసలదెందుకు తోచిందినీకు?

పా : నేను అక్కణ్ణుంచే Shoot చేస్తానుగనుక! అదేలెండి - నాకేగనక అలా అనిపిస్తే. ఆ ఆకులమధ్య దాక్కున్నవాడు ఇవతలవాళ్ళ కెవళ్ళకీ కనిపించడు గాని వాడిదృష్టికి మాత్రం ఏం అడ్డువుండదు.

చిదా : ముందు నువ్వా కిటికీ దగ్గర్నుంచి ఇవతలకు రా.

పా : నన్నెందుకు కాలుస్తారు వాళ్లు—

చిదా : (గదిలోంచి పరుగెత్తుతూ) శివపాదం-శివపాదం—

శివ : (చాలాదూరాన్నుంచి) సార్—

చిదా : ఇలారా.

శివ : (ఖాళీపూలబుండీతో పరుగెత్తుకు వస్తాడు)

చిదా : తోటమాలి వీరయ్య వెళ్ళిపోయాడా ,

శివ : లేదుసార్- వంటింటిదగ్గర అన్నం పెట్టించు కుంటు న్నాడుసార్.

చిదా : ఐతే వంటింటి తలుపులు మళ్ళీ తీసిందన్నమాట ఆ దెయ్యం!

శివ : లేదుసార్—కిటికీలోంచి పెడుతోంది సార్!

చిదా : వాణ్ణి వెళ్ళి దొడ్లో వేపచెట్టుకింద కూర్చోమనిచెప్పు. మళ్ళీ నే చెప్పేదాకా వాడక్కణ్ణుంచి కదలరాదు.

శివ : వేపచెట్టు క్రిందా ? ....ఎందుకూ .... సరేసార్— (వెళ్ళిపోతాడు)

(చిదానందం లోపలికివచ్చి పిస్టలువుంచిన డ్రాయరు దగ్గరకు వెళ్ళి దాని కోసం చూస్తూంటాడు)

పా : ఏం కావాలి - వెతుకుతున్నారు? [అతను బైటికితీసిన పిస్టలుచూసి] జాగ్రత్త- జాగ్రత్తండీ. చాలా అపా య కరం అదీ—

చిదా : నాకు తెలుసా సంగతి.

పా : చాలాతుప్పుపట్టింది- ఇట్టే పేలుతుందేమో కూడానూ. [అతను అందులో తోటాలు పెడుతూంటాడు] మీరు

దాన్ని వాడికూడా చాలారోజులైంది. జ్ఞాపకం వుందా? మనపెళ్ళయిన కొత్తల్లో .... మనింట్లోకి ఓ పందికొక్కు వస్తే దాన్ని కాల్చెయ్యాలని చూశారు. దాని దుంపతెగ - అది మహావేగంగా పరుగెత్తబట్టిగానీ - లేకపోతే దెబ్బకి చచ్చి వూరుకునేది. అప్పణ్నుంచి మళ్ళీ ముట్టుకోలేదు. ....ఏమన్నా పాడైందేమో—

చిదా : ఏదో కాస్త దుమ్ముకొట్టుకు వుందన్న మాటేగాని మంచి ఆర్డరులో వుంది.

[శివపాదం పూలువుంచిన కుండీతో ప్రవేశిస్తాడు]

ఆఁ—శివపాదం! వీరయ్యగాడు వేపచెట్టు క్రింద కూర్చున్నాడా వెళ్ళి?

శివ : కూర్చున్నాడు సార్ [కుండీ స్టాండుమీద వుంచి] అధమం—మీరిలా చెప్పారని చెప్పాను [ఈ మాటలు చెప్తూచెప్తూ తోటవేపుకిటికీ దగ్గరకు పోతాడు]

చిదా : ఇవతలకు రా అక్కణ్నుంచి-

[శివపాదం ఆశ్చర్యంతో చూస్తాడు]

రావయ్యా బాబూ ఇవతలకి— ఆవేపచెట్టుమీద ఎవడన్నా వున్నాడేమో పిస్టలు పట్టుకునీ —

శివ : [ఇవతలకు వచ్చి] అంటే.... ఈ బాంబు పంపించి మళ్ళీ Shoot చేసి చంపడాని కూడా వస్తాడం టారా?

చిదా : ఎవడికి తెలుసు? ఏక్షణాన ఏబుఱ్ఱకి ఏబుద్ధి పుడు తుందో! అందులోనూ హంతకులకి! ఈ Cri-minals వున్నారే — Criminals .... వాళ్ళ మానసిక తత్వాన్ని నేను పదిహేనేళ్ళుగా .... ఆఁ - అన్నట్టు నువ్వు తలుపు తీసిగాని మాట్లాడావా పిరయ్యతో?

శివ : లేదుసార్ లేదు, కిటికీలోంచే మాట్లాడి మళ్ళీవెంటనే కిటికీతలుపులు కాస్తా మూసేశానుసార్. వంట మనిషికూడా అన్నదీ - వెంటనే రిజర్వుపోలీసుకి కబురు చేస్తే మంచిదీ—

పా : అవును, అవిడ మొదట్నుంచీ అంటూనే వుందా మాట. ఒకసారి వాళ్ళవూళ్ళోటా ....

చిదా : [పిస్తలు బల్లమీదవుంచి మిగిలివున్న రెండు బిస్కట్లలో వొకటి నోట్లోవేసుకుని కాస్త కాఫీ చప్పరించి] అబ్బ - నాకు సహించడంలేదు పార్వతీ—[అని కప్పు కిందబెట్టి] ముందా చెట్టుమీద ఎవడున్నాడో

చూస్తేగాని— [కిటికీప్రక్కకివెళ్ళి బహుకొద్దిగా మాత్రం తొంగిచూస్తాడు]

శివ : [చాలా ఆదుర్దాతో ఏంజరుగుతుందోనని మెడ ముందుకు చాచి మునివేళ్ళమీద నుంచుని చూస్తూంటాడు నోరుతెరుచుకుని]

పా ; [మామూలుగానే ఇలాంటి హడావుడికి అలవాటు పడినట్లు వుంటుంది]

[ఉన్నట్టుండి అకస్మాత్తుగా నిశ్శబ్దాన్ని చీల్చుకుని వీధితలుపు కొడ్తూన్న శబ్దం వస్తుంది. చిదానందం గబుక్కున తల ఇవతలకు లాక్కుంటాడు. ఈ అనుకోని సంఘటనకి అంతా మౌనం వహించి ఏం చెయ్యడానికీ తోచక అలానే నుంచుంటారు,....మళ్ళీ తలుపు చప్పుడు. ముందుగా శివపాదం తెప్పరిల్లి వీధివైపు కిటికీ దగ్గరికి పోతూ....]

శివ : ఎవరో వీధితలుపు తట్టుతున్నారు సార్.

[చూడటానికి కిటికీ తలుపులు తియ్యబోతూంటే–]

చిదా : ఆ కిటికీ తెరవకు.

శివ : మరితియ్యకపోతే ఎవరో చూడటం ఎలాసార్!

చిదా : కిటికీ తెరిచావంటే నీతల పేలిపోతుంది. అందులోనూ ఆకాల్చేవాళ్ళు ముందూవెనకా ఆలోచించరు.

పా : అదికాదూ- మీతో మాట్లాడి పోదామని మీ స్నేహితులెవరైనా వచ్చారేమో నండీ—

[మళ్ళీ వీధితలుపు చప్పుడు]

శివ : ఓవేళ కిటికీ తెరిచి చూసినా కిందవీధిలో వాళ్లెవరూ కనిపించరు........ [కుర్చీ ఒకటి తెచ్చివేసుకు చూస్తాడు గాని వీధిలో మనిషి కనుపించడు]

చిదా : ఏం - కనిపించాడా?— ఎవడువాడు?

శివ : ఇంకా ఎత్తుచాల్లేదుసార్.

పా : ఆ స్టూలుకూడా వేసుకో శివపాదం.

శివ : ఆ(—స్టూలు- అదిసరిపోతుంది. [అని స్టూలుకూడా కుర్చీమీద పెట్టి చాలా జాగ్రత్తగా ఎక్కుతాడు]

పా : ఇప్పుడు కనిపిస్తున్నారా ఎవరన్నా?

శివ : [తొంగిచూస్తాడు,]

చిదా : [వణుకుతున్న కంఠంతో] వాడేనా? నల్లగా - పొట్టిగా - వుంగరాలు తిరిగిన క్రాపూ - వాడేనా, గడ్డం మీద కుడిప్రక్కగా ఆవగింజంత పుట్టుమచ్చ కూడా వుందికదూ?

శివ : కాదుసార్— తమరేంభయపడకండి. (కిందికిదిగి) వచ్చింది హంతకుడూకాదు, దోపిడి దొంగా

కాదు. గాంధీగారు! .... లోపలికి తీసుకు రమ్మంటారా?

చిదా : ఎ- ఎవరన్నావ్?

శివ : రామారావుగారు సార్. జ్ఞాపకంలేదూ? గాంధీ అతని ముద్దుపేరని చెప్పారుకూడానూ మీకు. మొన్న బుధవారంనాడు కోర్టుకి మీకోసం వస్తే మీరు చాలా బిజీగా వుండి ఇవ్వాళ ఇంటివగ్గర కలుసుకోమని చెప్పారాయనతో. ఓ కాగితంమీద నోట్ చేసుకున్నారు కూడానూ.

చిదా : నోట్ చేసుకున్నానా? [జేబులోంచి కాగితంముక్క తీసి] నేను నోట్ చేసుకున్నాను! [చూస్తూ] ఇది నారాతే?....అవును- నారాతే! .... హరే— రామ్! (కుర్చీలో కూలబడతాడు)

పా : [కాగితంతీసుకుని వ్రాత పరిశీలించిచూస్తూ భర్తతో మృదువుగా] ఈ వ్రాతవ్రాసింది ఓ విద్యావిహీన పశువు విషహస్తం!.... నువ్వు వెళ్ళి గాంధీ గార్ని లోపలికి తీసుకురా శివపాదం!.... అం— ఐంది చాలుగాని ఆపిస్తోలు అవతల పెట్టండిక - వొచ్చేలాయన ఏమనుకుంటాడో దాన్నిచూసి. [చాలా కులాసాగా పసిపిల్లాడితో మాట్లాడినట్లు

మాట్లాడుతుంది భర్తతో. ఆమె ఏమీ ఆశ్చర్యపడక పోవడం వల్ల భర్త ఇలా నిప్పులేకుండానే పొగ పుట్టించి గోరంతలు కొండంతలు చేసి హంగామా చేస్తూండటం పరిపాటేనని తెలుస్తూంది] ఆఁ- ఇక మిరాగంగలో బట్ట షర్ట్లు చేపతల్ని ఉద్ధరిస్తే వీర య్యని పిలిచి ఆ బకెట్ అవతలికి పంపేస్తాను. గోడ్సేగారు వచ్చేసరికి కాస్త నీటుగావుంటే బాగుం టుంది.

చిదా : గోడ్సేరావు—గాంధీ

[బకెట్ వైపు నడుస్తాడు]

పా : ఆఁ ఆఁ. అబ్బ- ఎలామరుపొస్తుందోగానీ నాకీపేరు! సరే—బోలెడు పనివుంది నాకు—ఇంకా పిండి రుబ్బించాలి - వడియాలు పెట్టించాలి. నే వెళ్తున్నా నాటూ.

[అని చేతీసుకుని వెళ్ళబోతూండగా]

చిదా : [ఆమెరెక్కపట్టుకుని ఆపి] పార్వతీ!....ఆ - ఆ పార్శిల్లో ఏం వుంటుందంటావ్? అఁ హాఁ - నీ వుద్దేశం—

పా : అందులో మీరు ప్రత్యేకంగా కావాలని తెప్పించు కున్న లంకపొగాకు చుట్టలు! ఇందాక నే నాసంగతే

చెప్పబోతే నాపీక ఖటిక్కున నొక్కేశారు.

[వెళ్తుంది]

[చిదానందం విచారంగా బకెట్ లోంచి నీళ్ళోడు తూన్న మొదటి పుస్తకం తీస్తూ ఏదో జ్ఞాపకం వచ్చి-]శివపాదం! శివపాదం!

శివ: (లోపల్నుంచే) సార్

చిదా: అరె - పొగాకు తడిసి పోతోందయ్యా.

(తెర పడుతుంది.)

---